# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటోశీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.




బొంబాయి 16, మహిమ్ లో ది 8, యూనియన్ హౌస్ యందున్న శ్రీమతి, ఆర్.ఆర్. ప్రభు ఇలా చెప్పుచున్నది; 'ఆయనకేదీ మెప్పులేదు. ఇంక బట్టల సందర్భంలోనా...!' ఇప్పుడు ఆయన బట్టలన్నిటినీ సన్‌లైట్‌తో ఉతుకుతున్నాను ...' ఆయనకూ, నాకూ పరమానందం! సన్‌లైట్ సమృద్ధిగా నురగ నిస్తుంది, ఉతికే పని నాకెంతో సులభం! 'నేను ఉతికేవన్నీ తెల్లగాను, కాంతిగాను ... పరిశుభ్రంగా వుంటాయి! నాకు సన్‌లైట్ తప్ప మరేదీ నచ్చదు!'

బట్టలను శుభ్రంగా ఉతుకుటకు ఉత్తమమైన, సౌమ్యమగు సన్‌లైట్ వంటిదింకేదీ లేదని గృహిణులు తెలుసుకున్నారు. మీరు కూడా గ్రహించుదురు.

# సన్‌లైట్

*మీ బట్టలకు వరప్రసాదం!*

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి




S.30-X29 TL

# పాఠకుల లేఖలు

## డిసెంబర్ 1961

దీపావళి సంచిక ఎంతో రమ్యంగా వుంది. ముఖ్యముగా అట్టమీది బొమ్మలు, "దేవయాని కథ", "అపూర్వ శక్తులు" అనే కథలు చాల బాగున్నవి.

—వి. రామమోహనరావు, కందుకూరు

ఈ నెల [నవంబరు] "చందమామ" సర్వాంగ సుందరమయి అనేకములగు బొమ్మలతో అలంకరించుకొని, అపుడే పాలసముద్రమున పుట్టిన నవ వధువు లక్ష్మి బోలె వెలువడినది.

—ఎ. ఎం. మనోహర్, తిరుపతి

ప్రింటింగ్‌లోకల్లా "చందమామ" ప్రింటింగ్ అమోఘమయినది. అందులో నవంబరు సంచిక అద్భుతం.

—వి. వి. స్వామి, మీనవిల్లూరు

"చందమామ" ఆంధ్రులకు గర్వకారణము. దీపావళి తమిళ సంచికలు చూసి సిగ్గుచెందిన నాకు ఈ "చందమామ"ను చూచి కొంత తృప్తి కలిగింది.

—మంచెళ్ల వెంకటరమణ, హైదరాబాద్

ఈ నెల "చందమామయ్య" అనుకొనంత సుందరంగా ముస్తాబయి అల్లుళ్ళను ఉర్రూత లూగించేడు.

—పుల్లేటి మురళీధరరావు, పెంద్రారోడ్

"చందమామ" దీపావళి సంచిక చాలా అమోఘముగా ఉన్నది. "దేవయాని" చిత్రాలు చూస్తుంటే కనులు మిరుమిట్లు గొల్పుతున్నాయి. యీ చిత్రాలు చిత్రించిన వడ్డాది పాపయ్యగార్కి నా అభివందనాలు.

—అందే చక్రపాణిరావు, చదలాడ

చందమామా! నేను భారత చరిత్రలోని సింధు నాగరికత చూస్తూ, దక్షయజ్ఞమును చూసి రాకాసి లోయకు వెళ్ళాను. లక్ష్మీకటాక్షం వల్ల తెలుసుకో గూడని సత్యం తెలుసుకుని, అచ్చటివారికి మంచి జయిస్తుంది అని దేవయాని కథ చెప్పాను. అందులో ఒకడు చేతకాని ఆత్మహత్య చేసుకుంటూ వస్తుంటే సహాయం చేశాను. కాని ఖలీఫా ఉమర్ శీలం చూడగానే ఇతను కొన్ని అపూర్వ శక్తులు గలవాడని అనుకుంటున్నా.

—గుల్లల సత్యన్నారాయణమూర్తి,
జగ్గంపేట

"చందమామ" దీపావళి ప్రత్యేక సంచిక వడ్డాది పాపయ్యగారి కలర్ వాష్ డ్రాయింగు చిత్రాలతో సర్వాంగ సుందరంగా అవతరించింది. సొంతం చదవందే విడిచిపెట్ట బుద్ధి కాకపోవడంకూడా ఈ సంచి ప్రత్యేకత.

—ఎం, వి. రంగా, కలకత్తా

"మంచి జయిస్తుంది", "దేవయాని" పురాణ కథ చాలా బాగున్నాయి.

—కోరాడ సరస్వతీరావు, పార్వతీపురం

దీపావళి సంచిక అనుకున్నంత బాగాలేదు. దేవయాని కథకు చిత్రాలు వేసిన వడ్డాది పాపయ్యగారికి ధన్యవాదములు. మిగిలిన కథలు బాగానే ఉన్నాయి.

—పోతుల చిన్నారావు, సామర్లకోట

వ. పా. గారి రంగుల వాష్ డ్రాయింగ్ చిత్రాలు, "దేవయాని కథ", "మంచి జయిస్తుంది" కథలు పత్రికకు వన్నె తెచ్చాయి. సీరియల్స్ చాలా బాగుగా నడుచుచున్నాయి.

—పి. నాగభూషణము, బీర్కూర్

"దేవయాని కథ", "ఖలీఫా ఉమర్ శీలం", "అపూర్వశక్తులు", "చేతకాని ఆత్మహత్య" చాలా బాగున్నవి.

—షేక్ కరీం అహ్మద్ షరీఫ్, గోపాలపురం

వస్తోంది





శేఖర్ ఫిలిమ్స్

# చిన్నన్న శపథం

డైరెక్షన్.... టి. ప్రకాశరావు * నిర్మాత.... సోమశేఖర్

CHITRALEKHA

ఆంధ్ర: మహాలక్ష్మి పిక్చర్స్ ★ సీడెడ్: భాస్కర్ పిక్చర్స్ ★ నైజాం: అన్నపూర్ణా పిక్చర్స్

అందరూ
ప్రశంసించేది న్యూట్రిన్



Nutrine

మిఠాయిలనే











ుందరమైన డబ్బాలలో అమర్చిన రుచి
రమగు న్యూట్రిన్ మిఠాయిలు అన్ని
శేష సందర్భాలలోను బహుమతిగా
వ్వతగినవి. మీ ప్రేమాభిమానాలకు
ది మధురమైన గురుతు.

న్యూట్రిన్ కన్ఫెక్షనరీ ప్రైవేట్ లిమిటెడ్
చిత్తూరు (ఆంధ్రప్రదేశ్)



మీ
శిరోజాలు
అంత మనో
హరంగావుండ
వలెనని మీ కోరిక!

ఇటు తిరిగి ఒక్క-
చూపు — మీ రెప్పలార్చ
మరచినవి, కారణం!
ఒత్తుగా మెరయుచుండే మనోహర
మైన ఆమె శిరోజాలు —
అప్పుడు మీ శిరోజాలు అంత
మనోహరంగా వున్నవని
తెలియు చుండుటచేత మీ
హృదయం ఉల్లాసంతో
ఉప్పొంగదా! అధిక
గుణవంతమైన పదార్థా
లతో కూడియున్న
ప్రశంసనీయ పరిమళం
గల 'కేష' మనోహర
మైన శిరోజాలు ఒత్తుగా
పెరుగునట్లుచేసి మీ
శిరోజాలకు కొత్త
చక్కదనము గలిగిం
చును – మీరు ఆశించే
కొత్త చక్కదనము!

మీ కేశ పోషణ పథకము
నేడే ప్రారంభించండి




లోమ గృహమునుండి
మరియొక శ్రేష్ఠమైన ఉత్పత్తి

పోల ఏజెంట్లు:
ఎమ్. ఎమ్. ఖంభట్ వాలా, అహమదాబాద్
ఏజెంట్లు:
ఏ. నరోత్తమ్ అండ్ కో., బొంబాయి-2

TEL






లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానంచేసి.
ఉత్సాహంగా ఆనంద డోలికల నూగులా
డండి! ఎంతో ఉల్లాసకరమైన
హాయి గొలువును!
లైఫ్‌బాయ్ మురికిలోనున్న క్రిములను
కడిగివేయును...కుటుంబములో అందరూ దీని
వల్ల ఆరోగ్యంగా వుంటారు!

# ఎక్కడ లైఫ్‌బాయ్ వున్నదో,
# అక్కడ ఆరోగ్యము వున్నది!

L-26-X29 TL

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

డిసెంబర్
విడుదల...





చిత్రకళా
సమర్పించు
చిత్రాలయా వారి

# విరిసిన వెన్నెల

దర్శకత్వం...
శ్రీధర్



కెమెరా..
విన్సెంట్
సంగీతం.
A.M.రాజా
మాటలు - పాటలు
అనిసెట్టి



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

దీపావళి ప్రత్యేక సంచికను గురించి పాఠకులందరూ సంతృప్తిని వెలిబుచ్చుతూ రాశారు. వారికి మా కృతజ్ఞత.

ఈ సంచికతో "దక్షయజ్ఞం" గేయకథ ముగుస్తున్నది. జనవరి నుంచి "పార్వతీ కల్యాణం" ప్రారంభమవుతుంది. ఇదికూడా శ్రీ ఉత్పలవారి రచనే. దానికి "వ. పా"గారి బొమ్మలుకూడా ఉంటాయి. ఇంతవరకు "మనదేశపు అద్భుతాలు" శీర్షిక వచ్చింది. దీనిస్థానే "ప్రపంచపు వింతలు" అన్న శీర్షిక ప్రారంభమవుతున్నది.

చాలామంది పాఠకులు "చందమామ"కు కథలు పంపటానికి అనుమతి కోరుతూ ఉత్తరాలు రాస్తున్నారు. కథలు ఎవరైనా పంపవచ్చు. ఎటువంటి కథలు పంపాలి అని కొందరు అడుగుతున్నారు. "చందమామ"లో ఎలాటి కథలు పడేదీ పాఠకులు తెలుసుకునే ఉండాలి. రచనల వెంట తిరుగు టపాకు బిళ్ళలు మాత్రం పంపండి. లేదా రచన తాలూకు కాపీ మీ వద్ద ఉంచుకోండి.

సంపుటి 29 : డిసెంబర్ 1961 : సంచిక 6



# భారత చరిత్ర



ఇంతకు ముందు సింధు నాగరికత గురించి కొంత తెలుసుకున్నాం. ఆ నాగరికతలో జీవించిన వారికీ ఆర్యులకూ చాలా తేడా లున్నాయి. ఆర్యుల సంస్కృతికి ఆధారం వేదాలు. వేదాలలో హరప్ప, మొహెంజొ దారోలాటి నగరాల ప్రసక్తి ఎక్కడా లేదు. వారికి. విగ్రహారాధన లేదు. వారి ఆరాధ్య దైవాలైన ఇంద్రుడు, వరుణుడు, మిత్రుడు, నాసత్యులు (అశ్వనీ దేవతలు) సూర్యుడు, అగ్ని—అందరూ పురుష దైవాలే.

వేదాలు ఏనాడు పుట్టినదీ స్పష్టంగా తెలియదు. కాని ఆసియా పశ్చిమప్రాంతం లోని దేశాలలో దొరికిన లిఖిత రూపమైన ఆధారాలనుబట్టి ఆ దేశాలను ఆర్య నామ ధేయాలుగల రాజులు పాలించారనీ, ఇంద్ర మిత్ర వరుణ నాసత్యులు వారి ఇష్ట దేవత లనీ స్పష్టమయింది. ఈ ఆధారాలు క్రీస్తు పూర్వం 14 వ శతాబ్దానివి.

ఆర్యులు ఎక్కడి నుంచో మన దేశానికి వచ్చారనటానికి ఋగ్వేదంలో ఆధారం ఉన్నది. ఇంద్రుడు బహుదూర ప్రాంతం నుండి యదు, తుర్వశులనే జాతుల వారిని తెచ్చాడట. ప్రాచీనకాలంలో పర్షియావారికి పశు లేక పరశు అనే పేర్లుండేవి; వారితో యదులకు సంబంధాలుండేవి. పరశులు పార్థవుడనే రాజుతో యుద్ధం చేసినట్టు ఋగ్వేదం వర్ణిస్తున్నది. ఈ పార్థవుడు సృంజయులకు రాజు.

కాలక్రమాన ఆర్యజాతులలో రెండు పక్షాలు ఏర్పడ్డాయి. ఒక పక్షాన సృంజయులూ, భరతులూ, రెండవ పక్షాన యదులూ, తుర్వశులూ, ద్రుహ్యులూ, అనులూ, పూరులూ ఉండేవారు. ఈ రెండో పక్షంవారు స్థానిక ప్రజలైన దశ్యులతో సహ జీవనం చేసినట్టు చెప్పబడింది. దశ్యులు నల్లనివారు, చట్టిముక్కులవారు, యజ్ఞ

**3. వేదకాలం నాటి ఆర్యులు**

బలులు ఇచ్చేవారుకారు, అర్యులకు అర్థం కాని భాష మాట్లాడేవారు. వీరే సింధు నాగరికతకు చెందిన వారనుకోవచ్చు.

ఆర్యజాతులుగా వేదాలలో కనిపించే వారిలో భరతులు ప్రత్యేకత గలవారు. వీరుండిన ప్రాంతాల గల నదులు దృష ద్వతీ, సరస్వతీ, ఆపయా. ఇవన్నీ మధ్య ఆసియా పడమర ప్రాంతాలివే. భరతులు అగ్నిని ఆరాధించేవారు. వారికి తృత్సు వంశంవారు పాలకులు. తృత్సులకు వశిష్ఠుడు కుల గురువు.

ఆర్యజాతుల మధ్య జరిగిన అంతః కలహాల ఫలితంగా భరతజాతి అత్యున్నత స్థానం సంపాదించుకున్నది.

ఆర్యులు అనార్యులతో చేసిన యుద్ధాలు ఇంకా ముఖ్యమైనవి. ఈ యుద్ధాలలో జయించి ఆర్యులు అనార్యదేశాలను ఆక్రమించారు. వారు తూర్పుగా విస్తరించారు. శంబరుడనే అనార్యవీరుణ్ణి దివోదాసుడనే వాడు ఓడించాడు. విశ్వామిత్రుణ్ణి గురువుగా పెట్టుకుని సుదాసుడనే వాడు యమునా తీరాన అనేక అనార్యజాతులను సమిష్టిగా పోరి ఓడించాడు. ఆర్యులు తూర్పు ప్రాంతాలను ఆక్రమించటానికి భరతులలాగే పూరులుకూడా విశేష కృషిచేశారు. ఋగ్వేద



కాలం నాటికి ఆర్యులు ఆక్రమించిన ప్రాంతం కాబూలునదీ ప్రాంతం నుంచి సరయూనదీ ప్రాంతం వరకూ ఉంది. "సప్తసింధు" అనేది ఈ ప్రాంతంలో పెద్ద భాగం.

ఈ ప్రాంతాన్ని అచ్చగా ఆర్యులే ఆక్రమించలేదు. ఆర్యులతో బాటు స్థానిక జాతులుకూడా ఉంటూండేవి.

ఋగ్వేదకాలం నాటి పరిపాలనాధికారం రాజుది. ఆయన తన రాష్ట్రాన్నీ, ప్రజలనూ కాపాడేవాడు. ఆయన కొక పురోహితుడు సలహా లివ్వటమేగాక, మంత్ర తంత్రాల ద్వారా రాజ్యానికి శుభం కలిగించేవాడు.

పరిపాలన ప్రజామోదం పొందాలన్న నియమం ఉండేది.

అ నాటి సాంఘికజీవితానికి కుటుంబం కుదురు. తండ్రి కుటుంబానికి పెద్ద. స్త్రీలు చదువుకునేవారు. కొందరు ఋక్కులు కూడా రచించారు. యుక్తవయసు వచ్చాకనే వారికి వివాహాలు జరిగేవి. వారు ధనం కోసమూ, ప్రేమించీ కూడా పెళ్లాడేవారు. హెచ్చుమందికి ఒకే భార్య ఉండేది, కాని బహు భార్యాత్వం దూష్యంకాదు. అ కాలపు దుస్తులు నూలుతోనూ, లేడిచర్మాలతోనూ, ఉన్నితోనూ చేసి వాటికి బంగారు అలంకరణలు అమర్చేవారు. బంగారు ఆభరణాలూ, పూలమాలలూ పండుగలకు విధిగా ధరించేవారు. అలాగే విందులలో మాంసాహారం ఉండేది. మామూలుగా వేపిన ధాన్యమూ, అపూపాలు అనే పిండి వంటలూ, పెరుగూ, వెన్నా, పళ్ళూ తినేవారు. మొదట గోమాంస భక్షణ ఉండేది గాని అది క్రమంగా దూష్యమయింది. వారు సోమం, సుర అనే రెండు రకాల మద్యాలు తాగేవారు. పురుషులు వేటా, వ్యాయామ క్రీడలూ అభ్యసించే వారు. స్త్రీలు నృత్యగానాలు నేర్చేవారు.

అర్యుల సమాజంలో వర్ణవ్యవస్థ క్రమంగా ఏర్పడింది; దస్యులనేవారు, శూద్రులయారు. అదే విధంగా ఆశ్రమాలు కూడా ఏర్పడ్డాయి. వ్యవసాయం ఉండేది. వర్తకం కూడా సాగేది. ధనం కింద గోవులనూ, నిష్కము లనే బంగారు నాణెములనూ వాడే వారు. రాక పోకలకు గుర్రాలు పూన్చిన రథాలూ, ఎడ్లు లాగే బళ్ళూ ఉండేవి. కమ్మరి, కుమ్మరి, కమసాలి, వైద్యవృత్తులుండేవి.

ఆర్యులకు లిపి ఉన్నట్టు కనబడదు. వేదాలు గురుముఖతః విని కంఠస్థం చేసే వారు. అశోకుడి శాసనాలకు వాడిన లిపి అనార్య లిపి.





# దక్షాధ్వర ధ్వంసము

షష్ఠాశ్వాసము

దీనులగుచు దివ్యర్షులు,
దేవతలును బ్రహ్మకడకు
పోయి మ్రొక్కి, రుద్రభటుల
పోకడలను చెప్పుకొనిరి;
"భృగుమహర్షి గడ్డమ్మును
పెఱికి పాఱవైచినారు;
దక్షుని తల ద్రెంచివేసి
దగ్ధముగావించినారు!
పాలు, నేయి, తేనియలను
నేలపాలు గావించిరి;
యాగాగ్నుల నార్పివేసి
యాజ్ఞికులను బంధించిరి!
ఏ మందుము! ఆ పవిత్ర
హోమాగ్నుల మూత్రించిరి;
భూతమ్ములవోలె వారు
ఆ తావున నర్తించిరి!"

మునులిట్టులు గగ్గోలుగ
మొఱపెట్టగ, ఆ విధాత
చాలు చాలు మీకు తగిన
శాస్తి జరిగెనని పల్కెను.
"పరమశివుని పరిభవించి
జరిపించెడు యాగమిట్లు
ధ్వంసముగా కుండుటెట్లు?
హింస జరుగకుండుటెట్లు?
శీఘ్రముగా మీరు పోయి
శివుని కాళ్ళమీద పడుడు—
భక్తపరాధీనుడతడు!
పరమదయాశీలియతడు!"
అని విధాత బోధింపగ
మునులిట్టులు పలికినారు:
"ఏ మొగమున శివుని కడకు
ఏగమందువో దేవా!

ఉత్పల సత్యనారాయణాచార్య



"హర హర శంభో శంకర!
కరుణింపుము పరమేశ్వర!"
అనుచు మునులు పరమేశుని
అడుగులపై పడి మ్రొక్కిరి.

బ్రహ్మ శివులు ఒకరినొకరు
భ్రమసి కౌగిలించుకొనిరి;
శివుని గొల్చి బ్రహ్మయపుడు
చేతులెత్తి యిట్లు పలికె:

"విష్ణుదేవుని మాయమోహము
విశ్వమంతట నిండియున్నది;
అతని మాయామోహ మంటని
యట్టివాడవు నీవె, యీశ్వర!

మాయలో బడినట్టివారల
మాటలకు కోపింప కీశ్వర!
యజ్ఞభాగం బీవు గైకొని
యాగమును సాగింపు మీశ్వర!"

అని విధాత ప్రార్థింపగ
అనందము పొందె శివుడు;
దక్షయజ్ఞశాల కపుడు
దయచేసెను పరమశివుడు.

ప్రమథులెల్ల శివుని వెంట
పరుగున ఏతెంచినారు;
పాడుపడిన యజ్ఞశాల
బాగుగ నొనరించినారు.

శివుని సతికి అవమానము
చేసిన వారల మైతిమి—
హరుని ఉగ్రకోపమునకు
గురియగు వారల మైతిమి."

అని మౌనులు దీనముగా
ఆ బ్రహ్మను వేడుకొనిరి;
బ్రహ్మ వారలను గైకొని
పరమశివుని కడకేగెను.

ధర్భాసన మందు శివుడు
దాంతుండయి, శాంతుండయి
కూచుచుండి నారదుతో
గోష్ఠి జరుపుచుండె నపుడు.

దక్షుని మొండెమున మేక
తలను పెట్టి తెచ్చినారు;
శివపాద స్పర్శనమున
జీవించెను దక్షు డపుడు.

భృగుమునికి చింబోతుగడ్డము
పెట్టి తెచ్చిరి ప్రమథులప్పుడు;
శివుని కృపచే ఆ మహర్షియు
జీవితుండయి లేచి మ్రొక్కెను.

మృతిని పొందిన మునులు నిద్దుర
మేలుకాంచిన యట్లు లేచిరి!
దక్షుడపుడు శివు పదంబుల
దండమిడి దీనముగ నిట్లనె:

"కూతు నవమానించి చంపిన
పాతకుని నన్నేల ప్రోతువు?
ఈశ్వరుని నిను పరిభవించిన
హీనజంతువు నేల కాతువు?"

అనుచు దక్షుడు పరితపించుచు
ఆ మహేశుని చెంత ఏడ్చెను.
"శివుడు సంతోషింప యజ్ఞము
చేయు మీ"వని బ్రహ్మ చెప్పెను.

బ్రహ్మ వాక్కుతో దక్షుడు
ప్రారంభించెను యజ్ఞము;
పరమదయామయుని శివుని
భక్తితోడ పూజించెను.

ఓంకారముతో పాటుగ
హోమాగ్నులు మిన్నుముట్ట
ఆహుతులను గావించిరి,
అగ్నిష్టోమము చేసిరి.

అగ్నికుండమం దప్పుడు
అవతరించె ఉవ్వెత్తుగ
పొగలాగున నీలమేఘ
పుంజమువలె శ్రీవిష్ణువు.



బాల సూర్యప్రభలు చిమ్ముచు
పసిడి కోటీరమ్ము మెఱయగ,
శంఖ చక్ర గదాయుధమ్ములు
సందిదండలు శోభలీనగ,

అవతరించిన విష్ణుదేవుని
అఖిలలోక శరణ్యు గనుగొని
ఒక్కమా రెల్లరును మ్రొక్కిరి,
ఓం నమో నారాయణా యని.

నాల్గువేదములను బ్రహ్మ
నలుమొగముల పఠియించెను;
పారిషదుల గూడి శివుడు
నారాయణు స్తుతియించెను.

దక్షుండును, భృగుమహర్షి
దాసోహంబని మ్రొక్కిరి;
నారదాది మునులెల్లరు
నర్తించుచు కీర్తించిరి.

అపుడు వారల కభయ మిచ్చుచు
ఆది దేవుం డిట్లు పలికెను:
"బ్రహ్మ విష్ణు మహేశులందున
భావభేదము లేదు, దక్షుడ!

మూడు మూర్తులవాడ నేనయి
మూడు గుణముల వెలుగుచుందును;
ఈ త్రిమూర్తుల యందు భేదము
ఎంచకుండిన నీకు శుభమగు!"

అని పలుకుచు విష్ణుదేవు
డంతర్ధానము చెందెను;
దక్షు డమిత భక్తితోడ
ధాతను శివు బూజించెను.

అటుపిమ్మట—దాక్షాయణి
హైమవతిగ జన్మించెను,
తపమున మెప్పించి శివుని
తన వల్లభు జేసికొనెను.

★ సంపూర్ణం ★






## 6

[బ్రహ్మదండి మాంత్రికుడి శిష్యుడైన జయమల్లుతో కలిసి, కేశవుడు ఏనుగుల కొలనుకు స్నానానికి వెళ్ళాడు. అక్కణ్ణించి తిరిగి వచ్చేప్పుడు, జయమల్లు కేశవుడితో మాంత్రికుణ్ణుంచి రాకున్న ప్రమాదాన్ని గురించి చెప్పాడు. వాళ్ళిద్దరూ గుహను సమీపిస్తుండగా, మాంత్రికుడు వాళ్ళను ఎండు పుల్లలు తేవలసిందిగా కేక పెట్టాడు. తరవాత—]

బ్రహ్మదండి మాంత్రికుడు తమ కేసి చూస్తూ చిరునవ్వు నవ్వటం, కాలభైరవుడు ఆకలితో నకనక లాడిపోతున్నాడనటం, కేశవుడికి భయం కలిగించింది. ఒకవేళ తనూ, జయమల్లూ మాట్లాడుకున్న మాటలన్నీ, తన మంత్ర శక్తిచేత వాడు విన్నాడేమో అనుకున్నాడు కేశవుడు. ఇంక నాలుగైదు గంటల్లోపల తను మరణించటమో లేక బ్రహ్మదండి మాంత్రికుడు చావటమో తేలిపోతుంది.

కేశవుడు యిలాంటి ఆలోచనలతోనే జయమల్లుతో పాటు చెట్ల కింద పడివున్న ఎండు పుల్లలు ఏరాడు. అవి బాగా పెద్ద మోపుకు సరిపడ అయింతరవాత యిద్దరూ కలిసి, వాటిని నెత్తిన పెట్టుకుని మాంత్రికుడున్న గుహకేసి బయలుదేరారు. ఒక అర గంట గడిచిం తరవాత వాళ్ళు గుహను సమీపించేసరికి, లోపలి నుంచి బ్రహ్మదండి మాంత్రికుడు పఠిస్తున్న మంత్రాలు బయటికి వినబడుతున్నవి.




కేశవుడూ, జయమల్లూ ఎండు పుల్లల మోపులను గుహముందు పడవేసి, అడుగులో అడుగు వేసుకుంటూ, చప్పుడు చెయ్యకుండా గుహలోపలికి వెళ్ళారు.

బ్రహ్మదండి మాంత్రికుడు కాలభైరవుడి విగ్రహం ముందు బాచిపట్టు వేసుక్కూచుని, పెద్దగా మంత్రాలు చదువుతూ, మధ్య మధ్య చేతిలో వున్న చిన్న చిన్న గులక రాళ్లను విగ్రహం కేసి విసురుతున్నాడు. ఇదేం పూజ చెయ్యటం? అన్నట్టు కేశవుడు జయమల్లు కేసి సౌంజ్ఞ చేశాడు. అతడు పెదాల మీద వేలు వేసుకుని, మాట్లాడకు అన్నట్టు వురిమిచూశాడు.



కొండమీది గుహలో మాంత్రికుడు కాలభైరవుణ్ణి గులకరాళ్లతో పూజించి ప్రసన్నుణ్ణి చేసుకోవాలని ప్రయత్నిస్తుంటే, అక్కడ బ్రహ్మపురంలో ప్రజలూ, రాజుగారూ కూడా, పొరుగు రాజ్యపు సైన్యాలు తమమీద ఏ క్షణాన వచ్చి పడతవో అని గగ్గోలుపడి పోతున్నారు. రాజుగారూ, మంత్రీకూడా కొండ మీద శత్రుసైన్యాలేవో చేరినవని నమ్మారు. ఆ నమ్మకం వల్లనే వాళ్ళు కొంత సైన్యాన్ని కొండ మీద ఏమున్నదో చూసేందుకూ, శత్రుసైన్యం వుంటే వాళ్లను హతమార్చేందుకూ పంపారు. కాని, అనుకోని విధంగా సైన్యాలు కొండ ఎక్కే సమయానికి, కొండ అంతా కంపించిపోయి, పెద్ద పెద్ద రాళ్ళు మీద పడటంతో సైనికులు చాలా మంది మరణించారు. చావగా మిగిలిన సైనికులు తిరిగివచ్చి కొండ మీద తాము చూచిన దాన్ని గురించి రకరకాలుగా చెపుతున్నారు.

రాజుగారి రహస్య మందిరంలో ఆయనతోపాటు మంత్రీ, కొత్తగా నియమింపబడిన సేనానాయకుడూ, రాజ గురువూకూడా వున్నారు. సేనానాయకుడూ, మంత్రీ చెప్పింది విన్న తరవాత రాజు తన గురువు కేసి తిరిగి, "గురువర్యా, అంతా విన్నారు



గదా? సైనికులు చెప్పేదాంట్లో మనం ఏది నమ్మాలి? ఆ కొండమీద వందలసంఖ్యలో శత్రుసైనికు లున్నారన్న మాట నమ్మాలా? లేక శరీరం అంతా నెత్తురు పూసుకుని, నిప్పులు చెరిగే కళ్ళతో, నెత్తిన పెద్ద శిఖతో భయంకరంగా వున్న మాంత్రికుడున్నాడన్న మాట నమ్మాలా? నా కేమీ పాలుపోవటం లేదు," అన్నాడు.

రాజగురువు ఓ క్షణకాలం ఆలోచించి తృప్తిగా తలాడిస్తూ, "ఈ రెండు మాటలూ నిజమే అని మనం ఎందుకు నమ్మ గూడదు?" అని అడిగాడు.

"మాంత్రికుడికీ, శత్రుసైనికులకూ పొత్తెలా కుదురుతుంది? ఆ మాంత్రికుడు కూడా శత్రురాజుకు సహాయం చేయవచ్చిన వాడని మీ అభిప్రాయమా?" అన్నాడు రాజు అనుమానంగా.

"ఆ సంగతి మాత్రం నేను యిదమిత్థ మని తేల్చి చెప్పలేను. ఒక్క మాటలో చెప్పాలంటే, ఆ కొండ దగ్గరకు వెళ్ళిన మన సైనికులందరికీ మతులు పోయినై. వందల సంఖ్యలో శత్రుసైనికుల్ని చూసినవాళ్ళ మాట అటుంచి, అక్కడున్న మాంత్రికుడే కొండలో భూకంపం పుట్టించాడనికూడా కొందరు నమ్ముతున్నారు. పైగా, ఆ వింత



జంతువు ఒకటి!" అంటూ రాజగురువు చిరు నవ్వు నవ్వాడు.

"అలాంటి జంతువు వుండే అవకాశమే లేదంటారా? నేనూ మొదట నమ్మలేదు. కాని, ఆ మాంత్రికుణ్ణి గురించి విన్న తరవాత......" అంటూ మంత్రి నీళ్ళు నమిలాడు.

"మంత్రీ, నేనూ కొద్దో గొప్పో మంత్ర శాస్త్రం చదివినవాణ్ణే!" అంటూ రాజగురువు చిరుకోపంగా మంత్రికేసి చూశాడు.

"గురువర్యా, అందుకేగదా మిమ్మల్ని యిక్కడికి రావలసిందిగా కోరింది. మీ సహాయం లేకుండా మేము చేయగలి





గిండేమీ లేదు," అన్నాడు రాజుగారు బతి మాలుతున్నట్టు.

"సరే, కేవలం ఊహించిన వాటి సాయంతో మనం ఏం నిర్ణయాలు చేయ గలం? తమ అంగరక్షకుడి నాయకత్వాన కొండ దగ్గిరకు వెళ్ళిన సైనికుల్ని తిరిగి రానివ్వండి," అంటూ రాజగురువు లేచి గది బయిటికి వచ్చాడు.

రాజుగారు పంపగా, కొండమీద ఎవ రున్నారో, అక్కడి పరిస్థితు లెలా వున్నవో చూచి వచ్చేందుకు బయలుదేరిన ఆయన అంగరక్షకుడు, వెంట వున్న ఇద్దరు సైనికు లతో కొండ దాపున గల అడవిలోకి చేరాడు.



అల్లంత దూరాన భూకంపానికి ఎగుడు దిగుడుగా, ఒక రాయి మీద యింకో రాయి పడి వింత ఆకారాలు దాల్చి వున్న కొండను చూస్తూనే వాడి గుండెలు పీచుపీచు మన్నాయి. వాడి వెంట వున్న సైనికుల భయాన్ని గురించి చెప్పవలిసిందేలేదు.

"మీలో ఎవరైనా లోగడ ఈ కొండ ఎక్కారా? దారి మార్గాలు తెలిసిన వాడు ఒక్కడుంటే ఎంత బావుండును!" అన్నాడు రాజుగారి అంగరక్షకుడు.

అతడి వెంట వున్న సైనికుల్లో ఒకడు పూర్వం ఆ కొండ ఎక్కినవాడే. కాని, శత్రుసైనికుల్ని గురించిన కథలూ, వింత జంతువూ, మాంత్రికుడూ – ఇవన్నీ జ్ఞాపకం వచ్చి, వాడికి శరీరం జలదరిస్తున్నది.

"అయ్యో, మనం కొండెక్కి చూసే దేముంటుంది? ఒకవేళ అక్కడ శత్రు సైనికులు గాని, మాంత్రికుడుగాని వుంటే, మనం ప్రాణాలతో అక్కడి సంగతులు రాజుగారికి చెప్పేందుకు బతికివుండం. ఒక వేళ అలాటి వాళ్ళెవరూ అక్కడ లేకపోతే, మనం పని కట్టుకుని ఆ కొండ ఎక్కటం వృథా," అన్నాడా సైనికుడు.

అంగరక్షకుడికి ఈ మాటలు బాగానే వున్నట్టు తోచినై. తను తిరిగి వెళ్ళి రాజు








గారితో కొండమీద ఎవరూ లేరని చెపితే సరిపోతుంది. కాని, తన వెంట వున్న సైనికుల్ని నమ్మటం ఎట్లా? రాజుగారి నుంచి మెప్పు పొందేందుకు, వాళ్ళు తను కొండే ఎక్కలేదని ఆయనతో చెప్పేస్తే, తనకు ప్రాణాపాయం తప్పదు!

"ఉహుం, అదేం లాభంలేదు. మనం కొండ ఎక్కి అక్క డెవరున్నారో చూడ వలసిందే. శత్రువుల చేతిలో చచ్చామా, వీరస్వర్గం. బతికి బయటపడ్డామా, రాజు గారి నుంచి గొప్ప బహుమానాలు పొంద వచ్చు. అయినా...ఎవడైనా ఒక్కడు దారి చూపేవాడుంటే బావుండునే..." అంటూ అంగరక్షకుడు తల గోక్కొంటూ కొండకేసి చూడసాగాడు.

అంగరక్షకుడూ, సైనికులూ, ఏ చెట్టు కింద అయితే నిలబడి వున్నారో, ఆ చెట్టు మీదే కేశవుడి ముసలి తండ్రి కూచుని వున్నాడు. అతడు, తన కొడుకు వింత జంతువు నెక్కి కొండ మీదికి పారిపోయి నప్పటి నుంచీ, అక్కడ జరుగుతున్న సంగతులేవో చాలావరకు చూశాడు. మాంత్రికుడు గుహలో నుంచి బయటికి రావటం, తన కొడుకూ, అదే వయసువాడైన మరి ఒకడూ కలిసి మాట్లాడుకుంటూ వుండటం—బ్రహ్మపుర సైనికుల దాడీ, కొండలో పుట్టిన భూకంపం—సర్వం అతడు చూశాడు.

తన కొడుకు ఎవడో మాంత్రికుడికి చిక్కి పోయాడన్న నమ్మకం ఆ ముసలివాడికి కలిగింది. తను ఒంటరిగా వెళ్ళి అతణ్ణి రక్షించటం ఎలాగా అని అతడు ఆలో చిస్తున్నాడు. ఇప్పుడు ఈ సైనికులు చెట్టు కిందికి వచ్చి, ఆ కొండ ఎక్కాలని మాట్లాడు కుంటూ వుండటం, దారి చూపేవాడు వుంటే బావుంటుందని చెప్పుకోవటం, ముసలివాడికి ధైర్యం కలిగించింది.

ముసలివాడు పిల్లిలా చెట్టు కొమ్మల్లోంచి మెల్లిగా కిందికి దిగి, ఆ పక్కనే వున్న





మరో చెట్టు కిందికి వెళ్ళి వెల్లకిలా పడుకుని, కళ్ళు మూసుకుని, నిద్రలో ఏదో కలవరిస్తున్నవాడిలా శబ్దం చేశాడు. ఆ శబ్దం వింటూనే రాజుగారి అంగరక్షకుడికీ, సైనికులకూ పై ప్రాణాలు పైనే పోయినై ముగ్గురూ ఒక్కసారి ఎగిరి గంతేసి, ఆ ధ్వని వచ్చిన వైపుకు చూశారు. వాళ్లకు చెట్టు కింద ముసలివాడు కనిపించాడు.

"వీడే మాంత్రికుడై వుంటాడు! ఆ పొడవాటి గడ్డం చూశావా? వాడు నిద్రలో వున్నట్టుంది, గొంతు కోసేస్తే పీడా వీరగడవుతుంది," అన్నాడొక సైనికుడు.




ఈ మాటలు వింటూనే, తనకు అనుకోని ప్రమాదం ఏదో కలగనున్నదని గ్రహించిన ముసలివాడు, ఆవిలిస్తూ లేచికూచున్నాడు. ముసలివాడి వాలకం చూసి, వాడు మాంత్రికుడై వుండడని వూహించిన అంగరక్షకుడు, చప్పున ఒరలో నుంచి కత్తి దూసి, అట్టహాసం చేస్తూ అతడి దగ్గిరకు వెళ్ళి, "ఎవర్రా నువ్వు? ఈ కొండ దగ్గిర అడవిలో నీకేం పని?" అని పళ్ళు కొరుకుతూ ప్రశ్నించాడు.

ముసలివాడు జవాబు చెప్ప బోయేంతలో సైనికుల్లో ఒకడు, "నువ్వు మాంత్రికుడివా?" అని అడిగాడు. రెండోవాడు, "నువ్వు శత్రుదేశపు సైనికుడివా?" అని రెట్టించాడు.

"అయ్యా, నేను మీరనుకునే వాణ్ణెవర్నీ కాదు. ఈ అడివిలో కందమూలాలూ, ఆకలములూ తిని బతికే ఒక ముసలి వగ్గును. నన్ను చూసి మీరు శత్రుసైనికు డనుకోవటం వింతగావున్నది," అన్నాడు ముసలాడు.

"అలాగా, అయితే నీ ప్రాణానికి అపాయం కలగదని నేను అభయం యిస్తున్నాను. నేను స్వయం బ్రహ్మపుర రాజుగారి అంగరక్షకుణ్ణి! ఈ కొండమీద రాజద్రోహులెవరైనా వున్నారేమో; వుంటే హతమార్చాలని వచ్చాను. నీకు కొండమీది దారి తెరువు లేమైనా తెలుసా?" అని అంగరక్షకుడడిగాడు.



ముసలివాడు తన అరచేతిని, వెడల్పుగా చాచి, "ఇక్కడున్న గజిబిజి రేఖలూ, గుంటలూ సొట్టలూ ఎంతబాగా తెలుసో, కొండ మీది దారులు నా కంత బాగా తెలుసు," అన్నాడు.

"అహఁ, అవసరానికి భలే వాడివి కన బడ్డావ్. అయితే, ముందుండి కొండమీదికి దారి తియ్యి. ఇవ్వాళో రేపో కాటికి ప్రయాణం కట్టే వాడివిలా వున్నావుగాని, లేకపోతే రాజుగారికి చెప్పి, నీ కెన్ని బహుమానాలైనా యిప్పించే వాడిని," అన్నాడు అంగరక్షకుడు.

ముసలివాడికి అంగరక్షకుడనే మాటలు చెవి కెక్కటంలేదు. ఈ బ్రహ్మపుర సైనికుల సాయంతో తన కొడుకు కేశవుణ్ణి, మాంత్రికుడి బారి నుంచి రక్షించు కోవాలన్నదే అతడి ఆరాటం. అతడు కొండకేసి నడవసాగాడు. కొంచెందూరం అతణ్ణి అనుసరించి పోయింతరవాత, అంగరక్షకుడికి ముసలివాడి చేతిలో వున్న కత్తి కనబడింది. వాడు ఆశ్చర్యపోతూ, "అడవిలో కంద మూలాలు తిని బతికే నీకు ఈ కత్తి ఎందుకు?" అని అడిగాడు.

"నేనూ, ఒకప్పుడు బ్రహ్మపుర రాజు గారి దగ్గిర సైనికుడుగా వున్నాను—ఈ రాజుగారు కాదు, ఈయన తండ్రిగారి కాలంలో. అప్పటినుంచీ ఈ కత్తి నా వెంటనే వుంటున్నది," అన్నాడు ముసలివాడు విసుగ్గా.

ఆ మాటలు వింటూనే సైనికులు గుసగుస లాడారు. అంగరక్షకుడు వాళ్ళకేసి ఉరిమి చూస్తూ, "మన ప్రాణాల కొచ్చిన భయం ఏమీలేదు. వాణ్ణి నమ్మలేకే ముందు దారి తియ్యమన్నాను. ఏదైనా మోసం జరిగేలా వుందో, వెనక నుంచి వాడి మెడ నరికేద్దాం," అన్నాడు మెల్లిగా.

ముసలి వాడికి ఈ మాటలు వినిపించినా, వినపించ నట్టే నటిస్తూ కొండ ఎక్కటం ప్రారంభించాడు. —(ఇంకా వుంది)






# దుష్కర్మ ఫలితం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి మళ్ళీ శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ లోకంలో న్యాయం లేదు. నీవు సజ్జనుడవే. కాని ఎవరో దుర్మార్గం తలపెట్టినందు వల్ల, ఏ పాపమూ ఎరుగని నీవు ఈ అర్ధరాత్రివేళ ఈ విధంగా శ్రమ పడుతున్నావు. ఒకరు చేసే పాపాలకు మరొకరు శిక్ష అనుభవిస్తారనటానికి నీ కొక కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

ఒకప్పు డొక రాజుండేవాడు. ఆయనకు తన భార్య అంటే మితిలేని ప్రేమ. ప్రేమ కొద్ది ఆమె కోరిన ప్రతి కోరికా తీర్చేవాడు.

ఈ విధంగా రాజు తన ప్రతి చిన్న కోరికనూ ఆజ్ఞగా శిరసావహించటం చేత రాణికి గారాబం జాస్తి అయింది. రానురాను ఆమె

## బేతాళ కథలు



కోరికలు మహా దారుణంగా ఉండసాగాయి. అసలే రాజుగారి పంచప్రాణాలకన్న ఎక్కువగా ఉంటున్న రాణీ గర్భవతి అయింది. దానితోబాటు ఆమె కోరికలు హెచ్చాయి. మామూలుగానే ఆమె కోరిన దెల్లా జరగనిచ్చే రాజు ఇప్పుడు మరింత ఉల్సాహంతో ఆమె కోరికలు చెల్లించాడు.

రాణి నిండు చూలాలై, ప్రసవించటానికి సిద్ధంగా ఉన్న రోజులలో రాజును ఒక భయంకరమైన కోరిక కోరింది—తనకు మనిషిరక్తంలో స్నానం చెయ్యాలని ఉన్న దన్నది. ఈ ఘోరమైన కోరిక వినగానే రాజు చకితుడయాడు. అది చూసి రాణి,

"ఈ కోరిక తీరకపోయిందంటే నా ప్రాణం దక్కదు. నాతోపాటు నా గర్భంలో ఉన్న శిశువు ప్రాణంకూడా పోతుంది," అన్నది.

ఈ మాట వింటుంటేనే రాజుకు తన ప్రాణం పోయినంత పని అయింది. పాపం, ఆయన తన భార్యకు మగబిడ్డ పుట్టి తన వంశం నిలబెడతాడని ఎంతో ఆశతో ఎదురు చూస్తున్నాడు. అందుచేత ఆయన తన భార్య కోరిక తీర్చక తప్పలేదు.

ఆయన ఆజ్ఞ మీద కొందరు వేటగాళ్ళు అరణ్యంలోకి వెళ్ళి, ఒక పందఘుంది భిల్లులను పట్టుకుని రాజుగారి వద్దకు తెచ్చారు. రాజుగారు వాళ్ళపైన లేని నేరాలేవో మోపి శిరచ్ఛేదానికి ఉత్తరువు ఇచ్చాడు. దౌర్భాగ్యులైన ఆ భిల్లుల తలలు కొట్టించి, వారి రక్తమంతా ఒక చలువరాతి తొట్టెలో పట్టించి, రాజు తన భార్యను వచ్చి అందులో స్నానం చెయ్యమన్నాడు.

పరమానందంతో రాణి పరిగెత్తుకుంటూ రక్తపు తొట్టి దగ్గరకు వచ్చింది. రక్తాన్ని చూసింది. కెవ్వున అరిచి, స్పృహతప్పి పడిపోయింది. ఆ స్థితిలోనే ఆమెకు ఒక మగబిడ్డ పుట్టాడు.

ఆ పిల్లవాణ్ణి తల్లిదండ్రులు మహా గారాబంగా పెంచుతూ వచ్చారు. వాడు ఏడేళ్ళ

వాడై ఉండగా ఒకనాడు ఒక ముసలి బిచ్చగాడు రాజద్వారం వెలపల నిలబడి, "రాజునూ, అయన కొడుకునూ బయటికి రమ్మనండి," అని కేకలు పెట్టాడు. భటులు వచ్చి ఈ సంగతి చెప్పేసరికి రాజుకు పట్టరాని ఆగ్రహం వచ్చింది.

అయితే రాణి ఆయనతో, "ఆ బిచ్చగాడి రూపంలో వచ్చినవాడు ఏ దేవుడైనా కావచ్చు. అబ్బాయిని తీసుకుని బయటికి వెళ్ళండి. ఇంతలో వచ్చే నష్టమేమిటి?" అని అన్నది.

సరేనని రాజు తన కొడుకుతో సహా మేడ దిగి బయటిద్వారం వద్దకు వెళ్ళాడు. రాణీ పై అంతస్తు కిటికీలో నుంచి ముందుకు వంగి బయటికి చూస్తున్నది.

బిచ్చగాడు రాజకుమారుణ్ణి చూస్తూనే, "ఈ కుర్రవాడి శరీరం నిండా రక్తం ఉన్న దేమిటి?" అంటూ వెనక్కు తిరిగి వెళ్ళి పోయాడు. అదే క్షణంలో రాణి పై అంతస్తు కిటికీ నుంచి కిందపడి ప్రాణాలు వదిలింది.

రాణి చనిపోవటంతో రాజుకు జీవితం శూన్య మనిపించింది. "నూరుమంది భిల్లులను అక్రమంగా చంపి పాపం చేసినవాణ్ణి నేను గదా, ఇందుకు నా భార్య ఎందుకు శిక్ష పొందాలి? నేనే ముందు చనిపోయి



ఉంటే ఆమె నాతోబాటు తప్పక ప్రాణాలు వదిలేది. అందుచేత ఆమెతోబాటు నేను కూడా మరణిస్తాను," అని రాజు నిశ్చయించుకున్నాడు.

ఆయన అధికార్లందరినీ పిలిచి, "నేను ప్రాణత్యాగం చేసుకుంటున్నాను. నా కొడుకు యుక్తవయస్కుడయేదాకా నా తమ్ముడిచేత రాజ్యపాలన చేయించండి," అని ఆజ్ఞాపించి, ఆత్మహత్య చేసుకున్నాడు.

రాజకుమారుడు చూడటానికి అచ్చు తండ్రిలాగే ఉన్నప్పటికీ, అతనికి తల్లి మనస్తత్వం అలవడింది. అతని మనసుకు నిలకడ ఉండేదికాదు, అతని కోరికలు

విడ్డూరంగా ఉండేవి. అతని చుట్టూ ఉండే వారు అతన్ని అర్థంచేసుకుని, ఎంతో ఆదరంతో ఉండేవారు.

ఆ కుర్రవాడు సాధ్యమైనంత వరకు ఎవరితోను ఎలాటి సంబంధమూ పెట్టుకోకుండా, ఏకాంత వాసిలాగా పెరిగాడు. తరుచుగా అతను వేట నెపంమీద వేటగాళ్ళతో అడవికి వెళ్ళేవాడు. అక్కడ తన పరివారాన్ని మోసంచేసి తప్పించుకుని, ఒంటరిగా కొండలూ, అరణ్యాలూ కలియ తిరిగేవాడు. అతని మనసు దేని కోసమో వెతుకుతున్నట్టుండేది, కాని తన కేమి కావాలో అతనికే తెలియదు.

రాజకుమారుడు పెద్దవాడయేదాకా అతని పినతండ్రి ఒక్క పొల్లు రాకుండా రాజ్యపాలన జరిపాడు. ఆయన రాజకుమారుడికి తగిన కన్యను వెతికి వివాహం చేద్దామని కూడా ప్రయత్నించాడు. కాని ఎవరుకూడా తమ కుమార్తెను అతని కివ్వటానికి ఒప్పుకోలేదు. ఆ కుర్రవాడు శాపంతో పుట్టాడని పుకారు పడిపోయింది. ఈ పుకారు చాలా దూరం వ్యాపించటం వల్ల కడజాతి కన్యలు కూడా అతన్ని పెళ్ళాడ నిరాకరించారు. అందుచేత అతను బ్రహ్మచారిగా ఉండే రాజ్యాభిషేకం చేయించుకున్నాడు. అతనికి బ్రహ్మచారి రాజు అన్న పేరు వచ్చింది.



అతను ఒకసారి తన అలవాటుప్రకారం వేటకని బయలుదేరి, అడవిలో తన పరివారం నుంచి తప్పించుకుని, ఒంటరిగా అరణ్యమంతా సంచరిస్తూ ఒక ఋషీశ్వరుడి ఆశ్రమంలో ప్రవేశించాడు. ఆ ఆశ్రమం ఆవరణలో ఒక చిన్న వినాయకుడి గుడి ఉన్నది. దాని చుట్టూ ఎత్తయిన చెట్లూ, వాటిని అల్లుకుని వనలతలూ ఉన్నాయి. రాజు ఆ లతల మధ్యగా పాకి వెళ్ళి, చల్లని నీడలో పడుకుని నిద్రపోయాడు.

ఎక్కడో మనుషులు మాట్లాడుతున్నట్టు వినిపించి అతను నిద్రలేచి ఎదురుగా చూసే సరికి ఒక లావణ్యావతి అయిన మునికన్య వినాయకుడికి మొక్కుతూ, "దేవా, నాకు బ్రహ్మచారి రాజు భర్త అయేలాగు అనుగ్రహించు!" అని ప్రార్థన చేస్తున్నది.

అతను అమితాశ్చర్యం చెంది లతల చాటు నుంచి ఆ మునికన్య ఎదటికి వచ్చి, "నేనే బ్రహ్మచారి రాజును!" అన్నాడు. ఆమె ఆ ఆశ్రమంలో ఉండే ఋషీశ్వరుడి కుమార్తె, పేరు కువలయిని. ఆమె అతన్ని తన వెంట తండ్రి వద్దకు తీసుకువెళ్ళింది. ఆయన వారిద్దరూ వివాహమాడటానికి అనుమతించి ఆశీర్వదించాడు.

రాజు కువలయినిని తన వెంట తెచ్చుకుని ఆమెతో సుఖంగా జీవించసాగాడు.





కువలయిని పతివ్రతలాగ నిష్కళంకమైన ఆనందం పొందింది. కాని రాజుకు మాత్రం మనసు అస్థిమితంగా ఉండటమూ, అస్పష్టమైన వాంఛలతో బాధపడటమూ ఉంటూ వచ్చింది.

ఒకనాడు రాజూ, రాణీ వనానికి వెళ్లారు. అక్కడ వారు నడుస్తూ ఉండగా వారికి ఒక సన్యాసి ఎదురు వచ్చాడు. దంపతు లాయనకు ప్రణామం చెయ్యబోతూండగా ఆయన తన పాదాన్ని ఒక దర్భముల్లుపై వేశాడు. కాలిలో దర్భ గుచ్చుకునే సరికి ఆ సన్యాసి పెద్ద పెట్టున అరిచి, ఒంటికాలిపై గెంతి, నోటికి వచ్చినట్టు శాపనార్థాలు ఉచ్చరించాడు. సన్యాసి అయినవాడు కొంచెమైనా మనోనిగ్రహం లేకుండా ఉండటం చూసి కువలయిని గట్టిగా నవ్వేసింది.

వెంటనే సన్యాసి తన కోపాన్ని ఆమె మీదికి మరల్చి, "తొందరపడకు, నీవు ఏడ్చేరోజు ఎంతోదూరం లేదులే! ఎవరో చేసిన పాపం నిన్ను కట్టి కుడుపుతుంది, చూస్తూ ఉండు!" అన్నాడు.

ఈ సంఘటన జరిగిన కొద్ది కాలానికే నగరానికి ఒక వింతమనిషి వచ్చాడు. వాడి మొహం పొడుగుగా గుర్రం మొహం లాగుంది. వాడు వేణువు ఊదుతూ వీధి వెంబడి వస్తుంటే ఆ గానం విన్నవారందరూ మతులు పోయి, తమ్ము తాము మరిచి, వెర్రివేషాలు వేయసాగారు.

ఇది చూసి నగరవాసులకు మండిపోయింది. వారు గుర్రంమొహం వాణ్ణి పట్టుకుని దుర్గకు బలి ఇవ్వటానికి తీసుకుపోసాగారు. ఈ వార్త రాజుకు తెలిసింది. ఆయన ఆ విచిత్రవ్యక్తిని పిలిపించి, వేణువు వాయించ మన్నాడు. గుర్రంమొహం వాడు వాయించాడు.

ఆ గానం వింటుంటే, ఎల్లప్పుడూ చెదిరి ఉండే రాజుగారి మనసుకు స్థిమితం కలిగింది. ఆయన కళ్ళ ముందు హంసల

మయమైన మానస సరస్సూ, దాని తీరాన ఒక శ్వేతసుందరీ కనబడ్డాయి. ఆ దృశ్యం చూస్తుంటే రాజును ఇంతకాలమూ వేధించే అస్పష్టమైన కోరికకు ఒక రూపం వచ్చింది. అతనికి కావలిసింది ప్రపంచంలో ఆ శ్వేత సుందరి తప్ప ఇంకేమీ లేదు. ఆయన ఆ శ్వేతసుందరిని తప్ప మిగతా ప్రపంచాన్నీ, తన భార్య అయిన కువలయినినీ కూడా మరిచి పోయాడు.

రాజుగారికి మతి పోయిందన్నారు. ఆయనకు మానస సరస్సును చేరుకోవాలన్న కాంక్ష పుట్టిందని తెలుసుకుని, ఆయన కోట దాటి పోకుండా భటులు అహోరాత్రాలు కాపలా కాశారు.

అయినా ఒక రాత్రి రాజు అందరినీ ఏమరిచి కోట వెలుపడి ఎటో బయలు దేరాడు. కొంత దూరం వెళ్ళాక వెనక నుంచి కేక వినబడింది: "ఆగండి, మీరు మానస సరస్సుకు పోతున్నారు. మీకు దారి చూపిస్తాను."

రాజు ఆగి ఆ మనిషిని దగ్గిరికి రాని చ్చాడు. ఆమె కువలయిని. కాని ఆయన గుర్తించ లేదు. తనకు దారి చెప్పే మనిషి దొరికి నందుకు సంతోషించి ఆమెను వెంట బెట్టుకుని నడిచాడు. రోజులు గడిచి



పోతున్నా వారింకా నడుస్తూనే ఉన్నారు. కువలయిని నీరసించి పోతున్నది.

"నీ మూలంగా ఆలస్యమవుతున్నది. నాకు దారి చెప్పు. నేను ముందు వెళ్ళి పోతాను," అన్నాడాయన ఆమెతో.

"మన దారులు వేరయే చోటగాని చెప్పను," అన్న దామె. ఆ చోటు కూడా వచ్చింది. నీరసంతోనూ, ఆయాసంతోనూ ఆమె ఒక చెట్టు కింద పడిపోయి, మరి కదలలేక పోయింది.

"ఇక మీ దారి మీది. నా దారి నాది. మానస సరస్సుకు ఎటు వెళ్ళాలో నాకూ తెలీదు. గొంతులో ఊపిరి ఉన్నంతదాకా

మీ వెంట ఉండాలన్న కోరికతో మిమ్మల్ని మోసం చేశాను. నా పని అయిపోయింది," అన్నది కువలయిని.

రాజుకు వెర్రి కోపం వచ్చింది. ఆ ఆవేశంలో ఆయన ఆమె పీక గట్టిగా పట్టుకుని ఊపాడు. ఆమె ప్రాణం విడిచింది. ఆమె ప్రాణం పోగానే రాజుకు పట్టిన ఉన్మాదం కాస్తా దిగిపోయింది. ఆమె తన భార్య అనీ, తా నామెను చంపాననీ తెలుసుకున్నాడు. ఆమె పైన పడి ఏడిచాడు. ఆమె జుట్టు తన కంఠంచుట్టూ కట్టుకుని, ఆమె శరీరాన్ని చేతులలో ఎత్తుకుని సమీపంలో ఉన్న మడుగులోకి దూకి ఆయన ప్రాణత్యాగం చేసుకున్నాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, పెద్ద రాజు గదా నూరుమంది భిల్లులను చంపి పాపం చేశాడు? ఆ పాపం ఆయననూ, ఆయన భార్యనూ పీడించటమేగాక, ఆయన కొడుకునూ, ఆయనతో ఎట్టి సంబంధమూ లేని కువలయినినీ కూడా ఎందుకు సోకింది? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "పాపం ఒక్క మనిషికే చెందదు. ఆ మనిషితోనూ, ఆ పాపకార్యంతోనూ సంబంధం గల అందరినీ శిక్షిస్తుంది. కువలయినికి తన మామగారితో ఏమీ సంబంధం లేకపోయినప్పటికీ, "బ్రహ్మచారి రాజు నాకు భర్త కావాలి" అని కోరుకున్నప్పుడే తన మామగారు చేసుకున్న పాపంలో పాలు పంచుకోవటానికి సిద్ధపడింది. ఒక ఇల్లు తగలబడితే దాపున ఉండే ఇళ్ళన్నీ తగలబడతాయి. అలాగే పాపం కూడా ఒక వ్యక్తినీ, ఒక్క కార్యాన్నీ అంటిపెట్టుకుని ఉండదు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)






# సజ్జనుడి పాట్లు

బాగ్దాదులో ఖలీఫాగా ఉండే హారూన్ అల్ రషీద్ ఒక్కొక్క రాత్రి నిద్ర పట్టక బాధ పడేవాడు. అలాటప్పుడు ఆయన మారు వేషంలో తన అనుచరులతో సహా నగర పర్యటన చేయుటమో, సంగీతం ఆలకించటమో, కవిత్వం వినటమో, హాస్యకథలు చెప్పించుకోవటమో చేసేవాడు.

ఇలాగే ఒక రాత్రి ఆయన నిద్ర పట్టక తన అంగరక్షకుడైన మస్రూర్‌ను పంపి తన మంత్రి అయిన జాఫర్‌ను పిలిపించాడు. తరవాత ఆయన జాఫర్‌ను వెంట బెట్టుకుని పుస్తకభాండారానికి వెళ్ళి అక్కడ పుస్తకాలు వెతుకుతూండగా ఒక చిన్న పుస్తకం, చాలా పాతది కనిపించింది. ఖలీఫా దాన్ని తీసుకుని దుమ్ము దులిపి, పేజీలు తిప్పి చదవసాగాడు. చివరకాయన విరగబడి నవ్వి, మరుక్షణమే కంట తడిపెట్టుకున్నాడు.

ఇదంతా చూస్తున్న జాఫర్‌కు, చాలా ఆశ్చర్యం కలిగింది. అతడు ఖలీఫాను, "ఏలిన వారు ఆ పుస్తకం చదువుతూ మొదట నవ్వటానికీ, తరవాత కంట తడిపెట్టటానికి కారణం ఏమిటి?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు ఖలీఫా మండిపడి, "ఓరీ ధూర్తుడా! నన్ను ప్రశ్నించటానికి నీ వెవడవు? అలా అడిగినందుకు నీ కిదే శిక్ష! నేను ఎందుకు నవ్వానో, ఎందుకు ఏడిచానో, ఈ పుస్తకంలో ఉన్న విషయమేమిటో చెప్పగల వాణ్ణి నీవు తీసుకురాలేక పోయావో, నీ తల తప్పక తీయించేస్తాను," అన్నాడు.

ఉరుము ఉరిమి మంగలం మీద పడినట్టయింది. జాఫర్ వినయంగా, "దాసుడు చేసినది తప్పే! తప్పులు ఎవరైనా చేయవచ్చు, క్షమించే శాహతు ఏలినవారికి మాత్రమే ఉంటుంది," అన్నాడు.

సి. మాధవరావు



"నిన్ను క్షమించేది లేదు. నా నోట శిక్ష చెప్పినాక అది అమలు జరగవలిసిందే!" అన్నాడు ఖలీఫా.

"దేనికైనా వ్యవధి కావాలి. ఆ సంగతి మనకు తెలియగలందులకే అల్లా ఒక్క క్షణంలో సృష్టి యావత్తూ చేయగలిగి ఉండి కూడా ఆరు రోజులపాటు సృష్టి క్రియ జరిపాడు. నాకు మూడు రోజులు గడు విప్వండి," అని జాఫర్ ప్రాధేయపడ్డాడు.

"సరే, నీకు మూడు రోజులు గడు విచ్చాను. నేను చెప్పిన సమస్య విప్పగల వాణ్ణి వెతికిపట్టుకురా!" అన్నాడు ఖలీఫా. జాఫర్ సరాసరి ఇంటికి వెళ్ళి తన తండ్రికీ, సోదరుడికీ జరిగినదంతా చెప్పి, "ప్రభువులను సేవించటం పాముతో చెరలాటం! నేను ఈ రాజ్యంలో ఉండటం నాకూ, మీకూకూడా అపాయకరం. నేను దేశాల మీద వెళ్ళిపోతున్నాను," అని తనవారి వద్ద సెలవు తీసుకుని, తన కరవాలమూ, వెయ్యి దీనారాలూ వెంట ఉంచుకుని, కంచర గాడిద పైన ఒంటరిగా డమాస్కసు నగరానికి పయనమయాడు.

డమాస్కస్ భూలోక స్వర్గమని ఖ్యాతి పొందిన అందమైన నగరం. జాఫర్ తన కంచరగాడిద మీది నుంచి దిగి, దాన్ని నడిపిస్తూ, నగరసౌందర్యాన్ని విలోకిస్తూ వీధి వెంట నడుస్తూండగా ఆయన కొక దివ్య భవనం లాటిది కనబడింది. దాని చుట్టూ పెద్ద తోట ఉన్నది. ఆ తోటలో పట్టుబట్టలతో తయారుచేసిన గుడారం ఉన్నది. దానిలో ఖురాసాన్ రత్నకంబళాలు పరిచి ఉన్నాయి. వాటిమీద బాలీసులూ, మెత్తలూ వేసి ఉన్నాయి. గుడారం మధ్య పున్నమి చంద్రుడులాటి యువకుడు సుఖాసీనుడై ఉన్నాడు. అతని కెదురుగా అనేకమంది అతిథులు కూచుని మేలైన పానీయాలు సేవిస్తున్నారు. ఆ దృశ్యం చూస్తూ నిలబడి ఆనంద తన్మయుడైన జాఫర్‌కు ఆశ్చర్యం

కలిగించేలాగ, ఆ యువకుడి సరసను కూచుని ఉన్న యువతి కిన్నెరమీటుతూ దివ్యమైన పాట పాడ నారంభించింది.

అమృతధారలాటి ఆ గానానికి పరవశుడై జాఫర్ కొంచెం సమీపంగా వచ్చాడు. అప్పుడు గుడారంలోని యువకుడు అతన్ని గమనించి, దుమ్ముకొట్టుకుని ఉండటంవల్ల దూరప్రయాణం చేసి వచ్చిన వాడని గ్రహించి, బానిసకుర్రవాణ్ణి పంపి జాఫర్‌ను తన వద్దకు ఆహ్వానించాడు. జాఫర్‌కు ఎదురువెళ్ళి ఘనంగా స్వాగతం చెప్పి, "తమ రాకవల్ల నా గృహం పావనమయింది," అన్నాడు.

నౌకర్లు జాఫర్ కోసం దివ్యమైన భోజన పదార్థాలు తెచ్చారు. జాఫర్ చేతులు కడుగు కోవటానికి ఆ యువకుడే నీరు అందించి, ఆయనకు తానే స్వయంగా వడ్డించాడు. ఈ ఆతిథ్యం చూసి జాఫర్ మనసు ఆనందించినప్పటికీ, ఖలీఫా ఆగ్రహాన్ని అతనింకా మరవలేకపోయాడు.

జాఫర్‌కు ఆతిథ్య మిచ్చిన యువకుడి పేరు అత్తఫ్. అతను గొప్ప ధనికుడేగాక అతిథిసత్కారంలో అపూర్వమైనవాడు. అతిథిని చక్రవర్తికన్న హెచ్చుగా చూడాలనీ, అతిథికి అవసరమైతే తన సర్వస్వమూ, తన ప్రాణమూకూడా ఇవ్వాలనీ పూర్వులు చెప్పిన ధర్మాన్ని అక్షరాలా అనుసరించేవాడు.




తన అతిథిని ఏదో బాధిస్తున్నదని తెలిసి అతని మనసుకు ఉల్లాసం కలగటానికి అత్తఫ్ శాయశక్తులా ప్రయత్నించాడు. "తమ రెవరు? ఎక్కడి నుంచి, ఏ పని మీద మా నగరానికి దయచేశారు?" అని అతను అడిగితే, జాఫర్, "మాది బస్రా. నేనొక సైనికదళాధిపతిని. ఖలీఫాకు చెల్లించవలసినది చెల్లించలేక ప్రాణభీతితో ఇక్కడికి పారిపోయి వచ్చాను," అని జవాబు చెప్పాడు.



"తమ దురదృష్టం మా అదృష్టమన్న మాట! నా ఇల్లు మీ ఇల్లే అనుకోండి. నేనూ మీ వాణ్ణే. మీ రిక్కడ మీ ఇష్టం వచ్చినన్ని ఏళ్ళు నిస్సంకోచంగా ఉండి పొండి!" అన్నాడు అత్తఫ్.

జాఫర్ నాలుగు నెలలు అత్తఫ్ అతిథిగా గడిపాడు. ఇంతకాలమూ అత్తఫ్ జాఫర్‌ను క్షణంపాటుకూడా వదలక, అతని వెంట నీడలాగా ఉంటూవచ్చాడు. ఒక నాడు జాఫర్ అత్తఫ్‌తో, తనకు ఒంటరిగా నగర మంతటా తిరగాలని ఉన్నట్టు చెప్పాడు. అత్తఫ్ అతని కొక మంచి గుర్రాన్నిస్తానంటే జాఫర్ తనకు కాలినడకనే తిరగాలని ఉందన్నాడు. అత్తఫ్ అతనికి ఒక సంచీలో మూడు వందల దీనారాలిచ్చి, అవసరానికి వెంట ఉంచుకోమన్నాడు.

జాఫర్ మెల్లిగా నడుచుకుంటూ, ఖలీఫా వల్ల తనకు కలిగిన అవమానానికి కుళ్ళుతూ, మసీదుకు వెళ్ళి, అక్కడ నాలుగు మంచి ముక్కలు చెవిని వేసుకుని మనశ్శాంతి పొంది, బయటికివచ్చి, బిచ్చగాళ్ళకు దాన ధర్మాలుచేసి, ఊరు చూస్తూ ఒక పెద్ద భవంతి వద్దకు వచ్చాడు. ఆ ఇంటి కెదురుగా ఒక చలవరాతి బెంచి ఉన్నది, దానిపై తివాసీ పరిచి ఉన్నది. జాఫర్ దానిమీద కూచుని విశ్రాంతి తీసుకుంటూండగా అతని కెదురుగా ఉన్న కిటికీ తెరుచుకున్నది. ఒక అద్భుత లావణ్యవతి కనిపించి, వెలపల ఉన్న పూలమొక్కలకు నీరు పోసి, తల ఎత్తి జాఫర్‌ను చూసింది.

ఆమె అందం చూడగానే జాఫర్ హృదయాన్ని ప్రేమ దహించ నారంభించింది. ఆమె కిటికీ మూయబోతూ జాఫర్ తన కేసి తదేక దృష్టితో చూస్తూండటం గమనించి, "ఏమండీ, ఈ ఇల్లు మీ ఇల్లా?" అని అడిగింది.

"లేదు, దేవీ! కాని ఈ బానిస నీవాడు!" అన్నాడు జాఫర్.

"ఇది మీ ఇల్లు కానప్పుడు మీ తోవన మీ రెందుకు వెళ్ళిపోరు?" అని ఆమె అడిగింది.

"నీ మీద రెండు పద్యాలు కట్టటానికి కాస్త ఆగాను," అన్నాడు జాఫర్.

"ఏదీ చదవండి!" అన్నదామె.

జాఫర్ రెండు పద్యాలు చదివాడు. వాటిని శ్రద్ధగా విని ఆమె, "మీ కన్న మీ పద్యాలే కాస్తనయం!" అంటూ కిటికీ మూసేసుకున్నది.

ప్రేమవ్యాధి సోకిన జాఫర్ ఆమె మళ్ళీ కనిపిస్తుందనే దురాశతో చీకటి పడినదాకా ఆ బెంచీ మీదనే కూచుని, కాళ్ళీడ్చు కుంటూ అత్తఫ్ ఇంటికి వెళ్ళాడు. జాఫర్‌ని చూడగానే అత్తఫ్ ఆ దుర్దాగా, "అలా ఉన్నారేం?" అని అడిగాడు.

"నా ఒంట్లో ఏమీ బాగాలేదు, తమ్ముడూ. నాకు బతకాలన్న కోరికకూడా పోతున్నది," అన్నాడు జాఫర్.

అత్తఫ్ ఆందోళన మరింత అయింది. అతను నౌకరును పంపి నగరంలోని గొప్ప వైద్యుణ్ణి పిలిపించాడు. వైద్యుడు జాఫర్‌ను పరీకించి, "ఇది ప్రేమవ్యాధి!" అన్నాడు. అత్తఫ్ ఈ మాట వినగానే ఫక్కున నవ్వి, "ఆ అమ్మాయి ఎవరు?" అని జాఫర్‌ను అడిగాడు.





ఉన్నసంగతి చెబితేగాని అత్తఫ్ వదల డని తెలుసుకుని జాఫర్ జరిగినదంతా చెప్పి, ఆ స్త్రీనీ, ఆమె ఉండే ఇంటినీ వర్ణించి చెప్పాడు. అత్తఫ్ గుండె గుబుక్కు మన్నది. ఎందుకంటే జాఫర్ ప్రేమించిన స్త్రీ అతనికి దగ్గిర బంధువు, అతనికి భార్య కానున్నది. వారిద్దరూ పరస్పరం ప్రేమించు కుంటున్నారుకూడా. ఈ సంగతి జాఫర్‌కు తెలిస్తే అతను తన ప్రేమను చంపేసు కుంటాడు. కాని అత్తఫ్ ఆదర్శం భగ్న మవుతుంది. అతిథి కోరికను ఎంత స్వల్ప మైన దాన్నికూడా తోసి పుచ్చరాదని అత్తఫ్ నియమం. తన అతిథి తన ప్రియురాలిని గాఢంగా కోరుతున్నాడు. అటువంటి కోరి కను చావనివ్వ వచ్చునా?

అత్తఫ్ తన బంధువుల ఇంటికి వెళ్ళి, తన ప్రియురాలితోనూ, ఆమె తండ్రితోనూ మాట్లాడాడు. "నాలో ఒక పవిత్రమైన కోరిక కలిగింది. నేను పుణ్యక్షేత్రాలు చూడబోతున్నాను. మక్కా వెళ్ళి అక్కడ కొన్ని ఏళ్ళుంటాను. తరవాత మదీనా వెళ్ళి అక్కడకూడా కొన్ని ఏళ్ళు గడపాలని ఉంది. ఈ కార్యక్రమానికి అంతరాయంగా ఉంటుంది గనక నా పెళ్ళి ప్రయత్నం మానుకున్నాను. మంచి సంబంధం ఏదైనా చూసి మీ అమ్మాయికి పెళ్ళి చేసెయ్యండి. నా పైన ఆశలు పెట్టుకోవద్దు," అన్నాడు.

ఈ మాటలు విని తండ్రి కూతుళ్లు గిలగిల లాడారు. "ఈ వయసులో నీ బుద్ధి మక్కా మదీనాల పైకి ఎందుకు మళ్ళింది? హాయిగా పెళ్ళాడి జీవితం సుఖంగా గడపక లేనిపోని ప్రయాసలన్నీ ఎందుకు తెచ్చి పెట్టు కుంటావు?" అన్నారు.

"పవిత్రమైన నా నిర్ణయాన్ని మార్చ యత్నించకండి. నేను ఉన్న సంగతి చెప్పి పోవటానికే వచ్చాను. మీ సలహా కోసం రాలేదు," అంటూ అత్తఫ్ తన ఇంటికి తిరిగి వచ్చేశాడు.

అతను జాఫర్‌తో, "మిత్రమా, చింత మానుకో. నీ కోరిక నెరవేరే ఏర్పాట్లుచేసి వచ్చాను. ఒక్క చిన్నమోసం చేస్తే నీకా పిల్ల భార్య అవుతుంది. మా మామ గొప్ప వాడు. తన కుమార్తెను ఊరూ పేరూ లేని వాడి కివ్వడు. అందుచేత నీకు కావలిసిన పరివారమూ, గుడారాలూ, బానిసలూ మొదలైనవి నేను సమకూరుస్తాను. నీవు నగరం వెలపల అట్టహాసంగా శిబిరం వేసి ఉండు. నీవు సాక్షాత్తూ ఖలీఫా మంత్రి అయిన జాఫర్‌వని నేను ఊళ్లో పుకారు వేస్తాను. తరవాత నీవు మా మామకు కబురుచేసి, ఆయన కుమార్తెను పెళ్ళాడ గోరుతున్నానని చెప్పించు. నీకు నీ ప్రియురాలితో వివాహం అయిపోతుంది," అన్నాడు.

తన అతిథి నిజంగా ఖలీఫా మంత్రేనని అత్తఫ్ ఎరగడు. అయినా దైవికంగా అతని నోటి వెంట ఆ మాటే వచ్చింది. అతను నగరానికి దూరంగా గుడారాలూ, సిబ్బందీ, గుర్రాలూ, ఇతర హంగామా అమర్చి, జాఫర్‌కు తగిన దుస్తులు ఏర్పాటుచేసి, అతన్ని రహస్యంగా ఆ శిబిరంలో రాత్రివేళ ప్రవేశపెట్టాడు.

అతను పంపగా, కొందరు బానిస నౌకర్లు డమాస్కస్‌లోని నాయబ్ (రాజ ప్రతినిధి)




వద్దకు వెళ్ళి, బాగ్దాదు నుంచి ఖలీఫావారి ప్రధాన మంత్రి జాఫర్ వేంచేసి నగరం వెలపల మకాం చేసి ఉన్నారని చెప్పారు.

నాయబ్ వెంటనే నగర ముఖ్యులను వెంట బెట్టుకుని అట్టహాసంగా జాఫర్ శిబిరానికి వెళ్ళి, "ప్రభూ, తమ రాక గురించి ముందుగా కబురుపంపక పోయారా ? ఘనమైన స్వాగత సన్మానం ఏర్పాటుచేతునే!" అన్నాడు.

అందుకు జాఫర్, "అది అంత ముఖ్యం కాదు. నేను గాలిమార్పు కోసం బయలుదేరి వచ్చాను. నా వివాహం అయేవరకు మాత్రమే ఉండి తిరిగి వెళతాను. మీ నగరంలో అమర్

అనే సంపన్నుడికి ఒక కుమార్తె ఉన్నదని విన్నాను. నాకూ ఆమెకూ వివాహం ఏర్పాటు చేయగలరేమో చూడండి," అన్నాడు.

నాయబ్ వెంటనే బయలుదేరి వెళ్ళి అమర్‌కు మంత్రిగారి కోరిక నివేదించాడు. అమర్ తల వంచక తప్పింది కాదు. అత్తఫ్ ఇచ్చిన సహకారం ధర్మమా అంటూ జాఫర్ అందరికీ బంగారమూ, బట్టలూ కానుకలు పెట్టాడు. వివాహ సమ్మతి పత్రం రాయటానికి కాజీ వచ్చాడు. పత్రంపై సాక్షులు సంతకాలు చేశారు. అందరికీ పానకమూ, భోజనమూ మొదలైనవి పెట్టారు. జాఫర్ తన భార్యతోసహా కాపరం ఉండటానికి ఒక ఇల్లు ఏర్పాటు చేస్తానని నాయబ్ అన్నాడు. కాని జాఫర్, "నేను ఖలీఫాగారి అజ్ఞను అనుసరించి వచ్చిన వాణ్ణి కాను. అందుచేత తిరిగి వెళ్లిపోవాలి. మా వివాహపు వేడుకలన్నీ బాగ్దాదు నగరంలోనే జరుగుతాయి," అన్నాడు.

అతను పరివారంలో సహా బాగ్దాదు దిక్కుగా బయలుదేరాడు. అతని భార్య ఒక మేనాలో ప్రయాణం చేసింది. వారు కొద్ది గంటలు ప్రయాణం చేశారో లేదో, అత్తఫ్ వెనుక నుంచి గుర్రం మీద వచ్చి వారిని కలుసుకున్నాడు. అతను జాఫర్‌ను ఆలింగనం చేసుకుని, "సోదరా, నీవు బయలుదేరిన క్షణం నుంచీ నా గుండె దడదడలాడి పోతున్నది. నీకు ఎడమైన దాని కన్న నీ పరిచయమే లేకపోతే ఎంతో బాగుండు ననిపిస్తున్నది," అన్నాడు.

అత్తఫ్ తనకు చూపిన ప్రేమాదరాలకూ, ఇచ్చిన అతిథ్యానికీ, చేసిన సహాయానికీ జాఫర్ కృతజ్ఞత తెలుపుకున్నాడు. ఇద్దరూ గుడారంలో కలిసి భోజనం చేశారు. "నీ యోగక్షేమాలు విడవకుండా తెలుపుతూండాలి," అంటూ అత్తఫ్ జాఫర్‌కు వీడ్కోలు చెప్పి, తిరిగి వెళ్ళాడు.

[ముగింపు వచ్చే సంచికలో]






# కష్టార్జితం

గుండు భీమన్నను పనిలోకి తీసుకున్న షావుకారు బస్తీలో గుండిగ నిండా నూనె కొని, మళ్ళీ గుర్రమెక్కి తన గ్రామానికి బయలుదేరాడు. గుండు భీమన్న నూనె గుండిగను నెత్తిన పెట్టుకుని, గుర్రం వెనకగా నడవసాగాడు.

చూస్తున్న కొద్దీ గుండు భీమన్నకు గుర్రం మీద మోజు పుట్టుకొచ్చి, తనకుకూడా అటువంటి గుర్రం ఉంటే బాగుండు ననిపించింది. వాడు షావుకారును, "దొరగారూ, ఆ గుర్రం ఖరీ దెంత?" అని అడిగాడు.

"అయిదువందలు. కొంటావా ఏమిటి?" అన్నాడు షావుకారు.

గుండు భీమన్న నడుస్తూ ఆలోచించాడు. ఇంటికి పోగానే షావుకారు పావలా ఇస్తాడు. అదిపెట్టి ఒక ఆడకోడి గుడ్డూ, ఒక మగకోడి గుడ్డూ కొనవచ్చు. ఆ గుడ్లలో నుంచి ఒక పెట్టా, ఒక పుంజూ వస్తాయి. అవి చాలా గుడ్లు పెడతాయి. వాటన్నిటి నుంచీ కోళ్ళు వచ్చి ఇంకా అన్నిరెట్లు గుడ్లు పెడతాయి. అవికూడా పెద్దవయాక అన్నిటినీ అమ్మితే నూరు రూపాయలు వస్తాయి. ఆ నూరు రూపాయలూ పెట్టి గొర్రెలను కొని కొద్దికాలం మేపితే పెద్ద గొర్రెల మంద తయారవుతుంది. ఆ మందను అమ్మితే సులువుగా అయిదువందల రూపాయలూ చేతికి వస్తాయి. ఆ డబ్బుపెట్టి తానుకూడా ఒక మంచి గుర్రాన్ని ఎక్కి, దౌడో దౌడు! దౌడో దౌడు!...

గుండు భీమన్న నూనె గుండిగను పట్టుకున్న రెండు చేతులూ తీసి కళ్ళెపు తాళ్ళు పట్టుకున్నట్టు నటిస్తూ, ఎగురుతూ పరిగెత్తాడు. మరుక్షణమే నూనె గుండిగ కిందపడి నూనె అంతా నేలపాలయి పోయింది.

షావుకారు ఆ చప్పుడు విని వెనక్కు తిరిగి చూసి, తన గుర్రాన్ని ఆపి దిగివచ్చి,



కోపంతో, "ఏమిట్రా ఇది?" అని అడిగాడు.

"తప్పు నాది కాదండి, నా గుర్రంది! అది మీ గుర్రం కన్న ముందు పరిగెత్తాలని చూసింది," అన్నాడు గుండు భీమన్న.

ఆ మాట షావుకారుకు అర్థం కాలేదు. గుండు భీమన్న తాను చేసిన ఆలోచన అంతా ఆయనతో చెప్పి, "నా పావలా సంగతి మరిచేరు," అన్నాడు.

"వెధవా, నాకు ఇంతనష్టం కలిగించింది చాలక, పావలాకూడా అడుగుతున్నావా? ఈ నష్టం తీరేదాకా నీ చేత చాకిరీ చేయించుకున్న మీదట నీ పావలా సంగతి చెబుతాను. ముందు ఇంటికి పద," అంటూ షావుకారు ఖాళీగుండిగ భీమన్న నెత్తిన పెట్టి, ఇంటికి తీసుకు పోయాడు.

షావుకారింటి వద్ద ఒక తెల్లకుక్క ఉన్నది. దానికి ఒంటిమీద పుండు పడింది. రోజూ షావుకారు స్వయంగా పుండుకు మందు రాచేవాడు. ఇప్పుడు నౌకరు ఏర్పడ్డాడు గనక ఆయన గుండు భీమన్నతో, "కుక్క పుండుకు మందురాచి, దానిపైన ఈగలు వాలకుండా చూడు," అన్నాడు.

గుండు భీమన్న కుక్కకు మందురాచి దాని పక్కనే కూచున్నాడు. ఈగలు వచ్చి పుండు మీద వాలబోయాయి.

వాడు చెయ్యి ఊపి, "పొండి, పొండి! దొరగారు వాల వద్దని చెప్పారు, వినలేదా?" అని ఈగలను కోప్పడ్డాడు.

ఈగలు అవతలికి వెళ్ళినట్టేవెళ్ళి మళ్ళీ వచ్చాయి. "చెబుతుంటే మీక్కాదూ? బుద్ధి ఉండక్కర్లా?" అని గుండు భీమన్న వాటిని కోప్పడ్డాడు. అయితే ఈగలు వినిపించుకోలేదు.

"దెబ్బకుగాని దయ్యం వదలదు," అంటూ గుండు భీమన్న అవతలికి వెళ్ళి ఒక పెద్ద రోకలి తెచ్చి, కుక్కమీద వాలిన ఈగలను చావగొట్ట బోయాడు. అదిచూసి కుక్క హడలిపోయి బయటికి పరిగెత్తింది.

భీమన్న దాన్ని వెంబడించాడు. వాణ్ణిచూసి కుక్క మరింత వేగంగా పరిగెత్తింది.

ఇద్దరూ ఊరి వెంట పడ్డారు. పారి పోతున్న షావుకారుగారి కుక్కను చూసి ఊరకుక్కలకు అలుసై, అవికూడా దాని వెంట పడ్డాయి. గుండు భీమన్న ఆ కుక్కల మంద వెనక పరిగెత్తాడు.

ఈ గొడవలో అసలు కుక్క ఎటో తప్పించుకు పోయింది. గుండు భీమన్న మరొక తెల్ల కుక్కను పట్టుకుని, "తప్పించుకు పోదామనుకున్నావా? ఇంటికి పద!" అన్నాడు. అది వాణ్ణి కరవ బోయింది. వాడు దాని మూతి గట్టిగా నొక్కిపట్టి, రెండో చేత్తో దాన్ని ఎత్తుకుని షావుకారుగారింటికి వచ్చి, కుక్కను నేలమీద పెట్టాడు. ఊపిరి సలపక అది దారిలోనే చచ్చింది.

షావుకారు ఆ కుక్కను చూసి, "ఇది ఎవరిదిరా? దీన్నెందుకు తెచ్చావు?" అని కోప్పడ్డాడు.

"ఇది మనదేనండీ. తెల్లకుక్క! కనిపించటంలా?" అన్నాడు గుండు భీమన్న.

"వెధవా, ఇది మన కుక్కయితే పుండేదీ?" అని షావుకారు అడిగాడు.

"మందు రాశాంగా? పోయింది పుండు!" అన్నాడు గుండు భీమన్న.




షావుకారుకు వాడి మాటలు వింటుంటే మండుకొచ్చింది. "మనదైతే మాత్రం చచ్చినదాన్ని ఇంటి కెందుకు తెచ్చావూ?" అన్నా డాయన.

"నేను పట్టుకున్నప్పుడది బతికే ఉంది. నన్ను కరవ బోయింది, అందుకని మూతి గట్టిగా నొక్కి పట్టుకున్నాను," అన్నాడు గుండు భీమన్న.

"ఓరి నీ బుద్ధి బుగ్గిగానూ! ఎవరిదో ఊళ్లోవాళ్ళ కుక్కను కాస్తా చంపేశావు. వాళ్ళకి సంగతి తెలిస్తే నా మర్యాదా, నీ ప్రాణాలూ దక్కవు! దీన్ని ఒక చాపలో చుట్టి చంకన పెట్టుకో. నేను గడ్డపార

తీసుకుని ముందుగా ఊరి బయటికి వెళ్ళి గుంట తవ్వుతాను. అందులో ఈ కుక్కను పాతిపెట్టి, గుట్టు చప్పుడు కాకుండా తిరిగి వద్దాం!" అన్నాడు షావుకారు.

ఆయన గడ్డపార తీసుకుని వెళ్లిపోయాక గుండు భీమన్న చచ్చిన తెల్లకుక్కను ఒక చాపలో చుట్టి చంకన పెట్టుకుని వెనకగా బయలుదేరాడు.

వాడు దారి వెతుక్కుంటూ షావుకారున్న చోటికి వెళ్ళేసరికి ఆయన గుంట తవ్వి సిద్ధంగా ఉన్నాడు.

"ఇంతసేపు చేశావేమిటి? కుక్కను వేగిరం బయటికి తియ్యి," అన్నాడాయన గుండు భీమన్నతో. కాని తీరా చాప చుట్ట విప్పి చూస్తే అందులో ఏమీలేదు. కుక్క దారిలో ఎక్కడో పడిపోయింది.

"వచ్చిన దారినే వెళ్ళి ఆ కుక్కను ఎక్కడ పారేశావో చూసి త్వరగా పట్టుకురా," అని షావుకారు గుండు భీమన్నను మళ్ళీ తరిమాడు.

వాడు తాను వచ్చిన దారి జ్ఞాపకంలేక మరొక దారిన యజమాని ఇంటిదాకా వెళ్ళాడు. దారిలో ఎక్కడా చచ్చిన కుక్క కనిపించలేదుగాని, ఇంటికి వచ్చేసరికి అసలు కుక్క ఇల్లు చేరి ఒక మూల పడుకుని ఉండటం కనిపించింది.



"దొంగ పీనుగా, దొరికావా?" అని గుండు భీమన్న ఆ కుక్కను తీసుకుని, షావుకారు వేచి ఉన్న చోటికి తెచ్చి, "దొరక్క ఎక్కడికి పోతుంది? ఇదుగో తెచ్చాను, పూడ్చండి," అన్నాడు.

"ఓరి దౌర్భాగ్యుడా, ఇది మన కుక్కరా. బతికే ఉంది. దీన్నెందుకు పూడ్చటం? ఆ చచ్చిన కుక్కేదీ?" అన్నాడు షావుకారు నిస్పృహతో.

"మీరు కాదన్నారుగాని, ఆ చచ్చిన కుక్క ఇదే నండీ! ఆ సన్యాసిలాగే ఇది కూడా చచ్చి మళ్ళీ బతికింది," అన్నాడు గుండు భీమన్న.

"ఛీ, తప్పుడు వెధవా! వెళ్ళి ఆ చచ్చిన కుక్కను పట్టుకురా!" అని యుజమాని గద్దించాడు.

విధిలేక గుండు భీమన్న మళ్ళీ బయలు దేరాడు. ఈసారి వాడు వచ్చిన దారినే వెళ్ళాడు. కుక్క పడిపోయిన చోట గుంపు చేరింది. ఆ గుంపులో దాని యజమాని కూడా ఉన్నాడు. కుక్క ఎలా చచ్చిపోయి ఉంటుందా అని అందరూ ఆశ్చర్యపడు తున్నారు. ఇంతలో గుండుభీమన్న అక్క డికి వచ్చి, చచ్చివున్న కుక్కను చూసి, "నువిక్కడున్నావా? రా, పూడ్చేస్తాం!" అంటూ ఆ కుక్కను ఎత్తుకున్నాడు.



అందరూ వాణ్ణి నిలవేసి, "ఏమిటిది? ఎవరు నువు? ఆ కుక్కతో నీ కేం పని? నువే దాన్ని చంపావా?" అని అడిగారు.

"మీ దుండంతయ్యా? గుంట దగ్గిర యుజమాని కాచుకునున్నాడు. ఎవరికీ తెలీకుండా దీన్ని ముందు పాతెయ్యాలె!" అన్నాడు గుండు భీమన్న

క్షణంలో నిజం తెలిసి పోయింది. అందరూ కలిసి గుండు భీమన్న వెంట షావుకారున్న చోటికి వెళ్ళి, "ఏమండీ, పెద్దవారు! మీకుకూడా ఇదేం పోగాలం?" అని అడిగారు.

పెద్ద మనిషికి అవమాన మయింది. ఆయన నెత్తి బాదుకుంటూ చచ్చిపోయిన కుక్క యజమానితో, "బాబూ, దారేపొయ్యే శనిని ఇంటికి తెచ్చుకున్నాను. వాడి బుద్ధి తక్కువ ఇంతా చేసింది. కుక్క చచ్చినందుకు డబ్బిచ్చుకుంటాను. ఇంతటితో నన్ను వదిలిపెట్టండి," అన్నాడు.

ఆయన భీమన్నతో, "చేసింది చాలు రా, బాబూ! ఇకనైనా వెళ్ళిపో!" అన్నాడు.

"అదేమిటి, దొరగారూ? నా పావలా మాటేమిటి?" అన్నాడు గుండు భీమన్న.

"చేసింది చాలక ఇంకా పావలా కావాల్రా? నీకు సిగ్గులేదూ?" అన్నాడు షావుకారు కోపంగా.

"మీ నష్టం తీరేదాకా చాకిరీ చేసినాక పావలా మాట చెబుతానంటిరి గదండీ. చాకిరీ చేశానుగద!" అన్నాడు భీమన్న.

వాడితో మాట్లాడుతూ అక్కడే నిలబడితే నలుగురి మధ్యా తన పరువు పూర్తిగా పోతుందని, వాడు వదిలిందేచాలు ననుకుంటూ ఆ షావుకారు వాడికి పావలా ఇచ్చేశాడు.

గుండు భీమన్న పరమానందంతో ఎగురుకుంటూ బామ్మకు పావలా చూపించటానికి ఇంటికి బయలుదేరాడు.

[పై మాసం మరొక సంఘటన]



## తెలికవాడి చిలుక ★ [రామతీర్థ కథ]

ఒక తెలికవాడి వద్ద ఒక అందమైన చిలుక ఉండేది. దాన్ని వాడు ఒక పెద్ద పంజరంలో పెట్టి తన నూనె దుకాణంలో వేళ్లాడదీసి ఉంచాడు.

ఒకనాడు తెలికవాడూ, వాడి నౌకరూ బయటికి వెళ్లిన సమయంలో దుకాణంలోకి ఒక గండు పిల్లి వచ్చింది. దాన్ని చూడగానే చిలుక భయపడి, పంజరంలో గెంతి, రెక్కలు తపతపా కొట్టి అర్భాటంచేసింది.

అది చేసిన గొడవకు పంజరం కాస్తా కొక్కెం నుండి ఊడి కింద పడింది. ఒక నూనెజాడీ పగిలిపోయి, యాభై రూపాయల ఖరీదుచేసే నూనె అంతా నేలపాలైపోయింది.

తెలికవాడు తిరిగి వచ్చి, చిలుక చేసిన పని చూసి, మండిపోయి, చిలుకను పంజరంలో నుంచి పైకితీసి, దాని నెత్తి మీది వెంట్రుకలన్నీ పీకేసి, బోడితల చేసేశాడు. అప్పటికిగాని వాడి కోపం చల్లారలేదు.

తనను ఇలాచేశాడని కోపంవచ్చి చిలుక యజమానితో మాట్లాడటం మానేసింది. యజమాని చాలా పశ్చాత్తాపపడ్డాడు.

రెండు వారాలు గడిచాక ఒక బట్టతలవాడు నూనె కొనటానికి దుకాణానికి వచ్చాడు. అంతకాలమూ బెల్లం కొట్టిన రాయిలా ఉన్న చిలుక గట్టిగా నవ్వసాగింది.

"ఎందుకా సంతోషం?" అని యజమాని అడిగాడు.

"ఈ మనిషి యజమానికూడా తెలికవాడే అయి ఉండాలి. లేకపోతే నెత్తిన ఒక్క వెంట్రుకైనా ఎందుకుండదూ?" అన్నది చిలుక.






# పులి - గాడిద

పూర్వం రామవరం అనే ఒక గ్రామంలో ఒక చాకలివాడు వుండేవాడు. వాడికి ఒక గాడిద వుండేది. ఆ గ్రామానికి కొంత దూరంలో ఒక అడవి వుండేది. ఆ అడవిలో ఒక పెద్ద పులి వుండేది. ఈ గ్రామంలో వుండే గాడిదకూ, అడవిలో నివసించే పులికీ ఎలాగో స్నేహం కలిసింది.

ఇట్లు వుంటూండగా ఒకనాడు ఆ రెంటికీ తమలో యెక్కువ బలవంతు లెవరు అనే విషయంలో కొంచెం భేదాభిప్రాయం వచ్చింది. ఆ రెండూ కొంతసేపు వాదులాడుకున్నై. చివరికి పులి, "మన మిద్దరమూ కొట్లాడుకుందాం. ఆ కొట్లాటలో ఎవరు గెలిస్తే వారు బలవంతులని నిర్ణయించుకుందాం," అన్నది. ఈ మాటకు గాడిద గూడా అంగీకరించింది.

పులి రామవరం గ్రామం వెళ్ళి, అక్కడ ఒక కంసాలివాడితో తన గోళ్ళకు బాగా పదును పెట్టించుకొని వచ్చింది. గాడిద కూడా తన యజమాని వద్ద వున్న బట్టలన్నీ వీపు మీద వేసుకొని, వాటిపైన బాగా మందంగా బురద పూసుకొని వచ్చింది. పులికీ, గాడిదకూ పోట్లాట ప్రారంభమైంది. పులి గాడిదను తన గోళ్ళతో రక్కుతున్నది. కాని ఎంత రక్కినా పులి గోళ్ళకు బురదా, బట్టలూ వస్తున్నవే గాని, గాడిద శరీరానికి ఏమీ అపాయం కలగటంలేదు. కాని గాడిద తన కాళ్ళతో పులిని లాగి తన్నుతున్నది. పులికి ఎముకలు విరిగినంత పనయింది. చివరకు పులి ఆ తన్నులకు నిలువలేక తాను ఓడిపోయినట్లు అంగీకరించింది.

ఇదంతా, ఆ అడవిలో ప్రతిరోజూ పశువుల్ని కాచుకొనే ఒక పిల్లవాడు చూచాడు. వాడిపేరు రాముడు. రాము డిదంతా చూచాడని పులి గ్రహించింది. అది రాముడి వద్దకు పోయి, "నేను ఓడిపోయానని నీవు ఎవరికీ

యస్. రాజగోపాలరావు

చెప్పవద్దు. అట్లా చెప్పావంటే నిన్ను చంపేస్తాను," అని బెదరించింది.

రాముడు ఈ భయంతో ఇంటికి పోయి ఎవరికీ తెలియకుండా పెద్ద ఉప్పుకుండలో దాక్కున్నాడు. ఆ రాత్రి భోజనసమయంలో వాడి తల్లి ఉప్పు కోసం కుండ దగ్గరకుపోతే, రాముడు దానిలో కనపడ్డాడు. రాముడి తల్లి వాడిని యిదంతా ఏమిటని అడిగింది. వాడు భయపడుతూనే మెల్లిగా జరిగిందంతా చెప్పాడు. అప్పుడు తలి దండ్రులు వాడికి ధైర్యం చెప్పి, ఆ రాత్రి చుట్టూ తమ మంచాలు వేసుకొని, వాడి మంచం మధ్యలో వేసి పడుకోబెట్టారు.

తాను ఓడిన విషయాన్ని రాముడు ఇంటి వద్ద చెపుతాడో, చెప్పడో చూద్దామని పులి రాముడి ఇంటి వెనక వున్న కాకర పొదలో దాక్కున్నది. రాముడు చెప్పిందంతా వినేటప్పటికి పులికి కోపం వచ్చింది. ఇంట్లో వాళ్ళందరూ నిద్రపోయిన తరువాత లోపలికిపోయి, రాముడి మంచాన్ని తన వీపుమీద పెట్టుకొని పులి అడవి కేసి బయలుదేరింది.

ఇట్లా కొంతదూరం పోయిం తర్వాత రాముడికి మెలకువ వచ్చింది. పులి తనను తీసుకొని పోతున్నదని వాడు తెలుసుకొని, మెల్లిగా పులి వెండ్రుకల్ని మంచం నులకకు కట్టాడు. కొంత సేపటికి పులి ఒక పెద్ద చింతచెట్టు కిందగా నడుస్తున్నది. రాముడు ఒక కొమ్మను పట్టుకొని చెట్టుపైకిపోయాడు.

పులి కొంతదూరం పోయేటప్పటికి ఒక పాడుపడిన బావి వచ్చింది. దానిలో రాముడిని మంచంతోపాటు వేద్దామనే వుద్దేశంతో, అది ఆ మంచాన్ని నూతిలోనికి విడిచి పెట్టింది. కాని, తన వెంట్రుకలు నులకకు కట్టివేయబడి వున్నవని పులికి తెలియదు! అందుచేత ఆ మంచంతోపాటు పులికూడా బావిలోనే పడి చచ్చి పోయింది. రాముడు చెట్టు దిగి, ఇంటికిపోయి సుఖంగా వున్నాడు.





# సువర్ణలోభి

గోర్డియస్ అనే రైతు రాజైన కథ లోగడ చదువుకున్నాం. ఆ గోర్డియస్‌కు మైడాస్ అని ఒక కుమారుడు కలిగాడు. వాడు చిన్నపిల్లవాడుగా ఉండగానే ఒకనాడు చీమల బారొకటి బంగారు రంగు గల గోధుమ ధాన్యపు గింజలను తీసుకుని వాడు నిద్రపోయే దిక్కుగా వచ్చింది. ఒక్కొక్క చీమా వాడి బుగ్గ మీదుగా ఎక్కి తాను తెచ్చిన గోధుమ గింజను వాడి పెదవుల మధ్య వెయ్యసాగింది. ఇది వాడి తల్లి చూసి తన పరివారాన్ని పిలిచి, "ఈ అద్భుతం చూశారా? యువరాజు పెద్ద అయాక ప్రపంచంలోకెల్లా ధనవంతుడవుతాడు!" అన్నది. అంతలోనే కుర్రవాడు నిద్ర మేలుకుని నోట్లో ఉన్న ధాన్యపు గింజలు చూసి, ఏడుస్తూ లేచి కూచున్నాడు.

కాలక్రమాన మైడాస్ పెద్దవాడై ఫ్రిజియా దేశానికి రాజయాడు. అతనిది మంచి పరిపాలనే కాని తెలివైన పరిపాలన కాదు. ఎందుకంటే అతను మూర్ఖుడూ, మందమతీనూ. అతనికి ఎంతసేపూ పూలతోటలంటే ప్రీతి, సంగీతమంటే చెవి కోసుకునేవాడు. వీటికి తోడుగా అతనికి సువర్ణలోభం కూడా పట్టుకున్నది. "నా కొడుకు అంతు లేని ధనం సంపాదిస్తాడు," అని తల్లి ఎప్పుడూ అంటూ ఉండిన మాటలు అతడికి వ్యసనమై పట్టుకున్నాయి.

కాని అంతులేని బంగారం ఎలా వస్తుంది. పరిసర దేశాల మీద యుద్ధం చేసి వాటిని కొల్లగొట్టాలి; అయితే మైడాస్‌కు యుద్ధాలు చేసే పాటి ప్రతాపం లేదు. పోనీ అతనికి వ్యాపారం చేసే దక్షతకూడా లేదు. అందుచేత మంత్రశక్తి వల్లనే తాను అపార ధనికుడు కావాలని అతను కలలు కంటూ వచ్చాడు. అతని రాజ్యంలో మాంత్రికులూ, మహిమలు గలవారూ లేరు. అందుచేత

అతను అరణ్యాలన్నీ తిరుగుతూ, మహిమ గలవారిని వెతుకుతూ, అడవులలో ఉండే ఆటవికులతో స్నేహం చేస్తూ ఉండేవాడు.

మైడాస్‌తో స్నేహం చేసిన వారిలో సాటర్లు అనే తక్కువ జాతి గంధర్వులుండేవారు. వీరి శరీరాలలో మనిషి లక్షణాలూ, జంతు లక్షణాలూ కలిసి ఉండేవి. మైడాస్‌కు ఒక సాటరుతో సఖ్యం కుదిరింది. వాడు పిల్లన గ్రోవి మీద పాడటం నేర్చిన మొదటి ప్రాణి ననీ, తనతో సమంగా గానదేవుడుకూడా పాడ లేడనీ ప్రగల్భాలు పలికాడు.

ఈ మాట ఆలకించి గానదేవుడు తన కిన్నెరతో సహా దిగి వచ్చాడు. మైడాస్‌ను తీర్పుగాడుగా ఉంచి గానదేవుడు సాటరుతో పోటీ జరిపాడు.

ఆ ఇద్దరి పాటా ఆలకించిన మైడాస్ తన మిత్రుడైన సాటరు గానమే బాగున్నదని తీర్పు చెప్పాడు.

గానదేవుడికి ఆగ్రహం వచ్చి, "నీ బుద్ధికి తగిన చెవులను బహుమానించాను పుచ్చుకో!" అని మైడాస్‌తో అన్నాడు. వెంటనే మైడాస్ చెవులు గాడిద చెవులుగా మారిపోయాయి. వాటిని ఎవరన్నా చూసి వేళాకోళం చేస్తారని మైడాస్ తన తలకు ఒక పెద్ద ఎర్ర తలపాగా చుట్టుకున్నాడు.



అయితే ఈ రహస్యాన్ని మంగలి దగ్గిర దాచటం మటుకు సాధ్యం కాదు. అందుకని మైడాస్ తన మంగలికి డబ్బు దండిగా ఇచ్చి, తన చెవుల రహస్యం ఎవరికీ చెప్ప నని ప్రమాణం చేయించుకున్నాడు.

మంగలి రాజుగారి రహస్యాన్ని చాలా కాలం దాచాడు గాని, చివరకు దాన్ని ఎవరి కైనా చెప్పకపోతే మతి పోతుందనిపించింది. ఆఖరుకు గాలికైనా గట్టిగా అరిచి చెప్పాలని వాడు అనుకున్నాడు. ఒకరోజు వాడు నదీ తీరానికి వెళ్ళి, ఒడ్డున ఒక గుంట తవ్వి, అందులో తల దూర్చి, "మైడాస్ రాజుగారి చెవులు గాడిద చెవులు!" అని పదేపదే



అరిచాడు. ఇలా కొంతసేపు అరిచాక వాడి మనసు స్థిమిత పడింది. అప్పుడు వాడు గుంటను పూడ్చేసి, "ఇక ఫరవాలేదు," అనుకున్నాడు.

కాని కొంత కాలమయాక ఆ గుంట నుంచి తుంగ మొలుచుకు వచ్చింది. గాలి కొట్టినప్పుడల్లా ఆ తుంగ, "మైడాస్ రాజు గారి చెవులు గాడిద చెవులు!" అని గొణగ నారంభించింది. ఈ విధంగా మైడాస్ రహస్యం ప్రజలందరికీ తెలిసిపోయింది.

ఇక మైడాస్‌కు రాజుగా ఉండాలని పించలేదు. ఆయన దూర దేశం వెళ్ళి పోతున్నానని ప్రకటించి, చిన్నవాడైన తన కొడుకు పెద్దయాక రాజయే ఏర్పాటు చేసి ప్రయాణమైనాడు.

మైడాస్ గ్రీసుదేశపు ఉత్తర ప్రాంతానికి చేరి అక్కడ స్థిరపడ నిశ్చయించాడు. అక్కడి ప్రజలకు తన గాడిద చెవుల రహస్యం తెలియదని ఆయనకు నమ్మకం కుదిరింది. ఆయన వాటిని ఇంకా ఎర్ర తలపాగాలోనే దాచి ఉంచుతున్నాడు. అక్కడ ఒక నిర్జనమైన లోయలో ఆయన తన కోసం ఒక రాజభవనం నిర్మించుకుని, దానిచుట్టూ చక్కని గులాబీ తోట నాటించాడు.

ఆ లోయ చుట్టూ ఉండే కొండల మీద సాటర్లుండే వారు. వారు గులాబీ తోటలోకి వచ్చి, మంత్ర శక్తులను గురించి అపూర్వమైన కథలు చెప్పుకోవటం మైడాస్ చాటు నుంచి చాలాసార్లు విన్నాడు. అయితే ఆ సాటర్లు మైడాస్‌ను అంత దూరాన చూస్తేనే పారిపోయేవారు. అందుచేత వారి చెలిమి ఆయనకు లభించలేదు.

వాళ్ళను ఎలాగైనా పట్టుకోవాలని నిశ్చయించుకుని మైడాస్ ఒక యుక్తిపన్నాడు. గులాబీ తోటలో ఒక జలయంత్రమూ, దాని కింద చలవరాతి తొట్టె ఉండేవి. ఈ తొట్టెలోని నీటిని సాటర్లు తరుచు తాగటం

మైడాస్ గమనించాడు. ఆయన ఒకనాడు జలయంత్రం నిలుపు చేయించి, తొట్టెలోని నీరు తీసేయించి, జలయంత్రం గుండా నీటికి బదులు ఘాటైన మద్యం ప్రవహించే టట్టు చేశాడు.

ఆ సాయంకాలమే సాటర్ల పెద్ద అయిన ఒక ముసలి సాటరు ఆ జలయంత్రం వద్దకు వచ్చి, మద్యం తనవితీరా తాగి, కైపెక్కి, పక్కనే ఉన్న గడ్డి తివాసీపై వెల్లికిలా పడుకుని, గురకపెట్టి వెన్నెలలో నిద్ర పోయాడు. ఆ సమయంలో మైడాస్ ఆ సాటరు వృద్ధుణ్ణి బంధించి తన భవనం లోకి తెప్పించాడు.



మర్నాడు సాటరు తెలివి వచ్చి, తాను బందీ అయినట్టు తెలుసుకుని, మైడాస్‌తో, "నన్ను వదిలి పెట్టావంటే నీకు అద్భుత మైన కథలు చెబుతాను," అంటూ విడ్డూర మైన కథలు చెప్పసాగాడు. ఆ వృద్ధుడు రకరకాల దేశాలను గురించీ, రెండు నిలువుల ఎత్తుండే మనుషులను గురించీ, దున్నకుండా విరగబండే పొలాలను గురించీ, దుఃఖమే ఎరగని మనుషులను గురించీ కథలు చెప్పాడు. మైడాస్ చలించలేదు.

చివరకు ముసలి సాటరు బంగారం కొల్లలుగా ఉండే దేశం గురించి చెప్పాడు. అక్కడ ఏది చెయ్యాలన్నా బంగారంతోనే చేస్తారుట. అక్కడ బంగారమే అన్నింటికీ ముడిపదార్థం!

"నే నక్కడికి పోవాలి! నాకు కావలి సింది బంగారమే—బంగారం గురించిన కథలు కాదు!" అన్నాడు మైడాస్.

"అలా అయితే నీవు నా వెంట మా రాజు గారి వద్దకు రా. ఆయన నీ కోరిక తీర్చ గలడు," అన్నాడు ముసలి సాటరు.

మైడాస్ సరే నన్నాడు. ఇద్దరూ కలిసి కొండల మధ్య ఉండే మరొక లోయకు వెళ్ళారు. అక్కడ ఒక పూపొదరింట సాటర్ల రాజు కూచుని ఉన్నాడు.



"మా ముసలివాడు పెద్ద పొరపాటు చేశాడు. ఆయన మీ గులాబీ తోటలో పడుకుని నిద్రపోవటం అపచారమే. అయినా ఆయనను తిరిగి మాకు అప్పగించినందుకు ప్రతిఫలంగా ఏం కావాలో కోరండి!" అన్నాడు సాటర్ల రాజు మైడాస్‌తో.

"నాకు వేరే ఏమీ వద్దు. నేను ముట్టుకున్నదల్లా బంగారమయేటట్టు అనుగ్రహించండి," అన్నాడు మైడాస్. సాటర్ల రాజు పెద్దగా నవ్వి, "సరే!" అంటూ మైడాస్‌ను తన మంత్రదండంతో తాకాడు.

మైడాస్ ఆనందం కట్టలు తెంచుకుని ప్రవహించింది. తన చిన్నతనంలో తల్లి అంటూ ఉండిన మాట ఇప్పటికి నిజం కానున్నది. ఇక తన కున్నంత బంగారం ప్రపంచంలో మరెవరికీ ఉండబోదు.

ఆయన ఇంటికి తిరిగి వస్తూ ఒక చెట్టు మండ తుంచాడు. మరుక్షణమే అది బంగారు మండగా మారి, మొయ్యలేనంత బరువెక్కింది. దారిలో కనిపించిన రాయి పైకి తీస్తే అది బంగారు ముద్దగా మారిపోయింది. ఆయన చెప్పులు విడిచేసి గడ్డి మీద నడిచాడు. ఆయన పాదాలు పడిన చోటనల్లా గడ్డి బంగారు గడ్డిగా మారిపోయింది. దుమ్ములో నుంచి నడిస్తే ఆయన పాదాల గుర్తులుకూడా బంగారం రంగు తిరిగాయి.

మైడాస్ వెర్రివాడులాగా అయిపోయాడు. అతను ఆనందంతో, "బంగారం! బంగారం!" అని కేకలు పెట్టాడు. ఇంటి స్తంభాలూ, గోడలూ, నేలా, అన్నీ బంగారు మయం చేసేశాడు. ఆయన శరీరం మీది బట్టలు అదివరకే బంగారువి అయిపోయాయి.

ఆయనను ఆకలి దహించ సాగింది. భోజనానికి కూచున్నాడు. ఆయన కూచున్న కుర్చీ, దాని ముందున్న బల్లా ఆయన స్పర్శతోనే బంగారువి అయాయి. ఆయన ముట్టుకున్న ఆహారమూ, పానీయాలూ

కూడా బంగారమై పోవటంతో పెద్ద చిక్కు వచ్చింది.

భోజనంలాగే ఆయనకు ఆ రాత్రి సుఖ నిద్రకూడా లేకుండా పోయింది. ఆయన పడుకున్న హంసతూలికా తల్పం ఆయన శరీరం తగలగానే బంగారుదైపోయి ఆయన శరీరాన్ని బాధపెట్టింది.

ఆ రాత్రి గడిచే సరికి మైడాస్‌కు బంగారమంటే భరించరాని రోత పుట్టింది. తోటలో పూలూ, పళ్ళూ అందంగా కనిపించాయి. కాని వాటిని తాకే యోగ్యత తనకు లేదు. ఆకలి దప్పులతో చచ్చిపోయే పరిస్థితి తానే కోరి తెచ్చుకున్నాడు.

మైడాస్ ఈ దుస్థితి నుంచి బయటపడటానికి సాటర్ల రాజునే శరణుజొచ్చాడు. "అయ్యా, బుద్ధి గడ్డితిని పాపిష్టి వరం కోరాను. నా లోభమే నన్ను ముంచింది. నాకు ఈ దిక్కుమాలిన బంగారం నుంచి విమోచన కలిగించండి," అన్నాడు.

సాటర్ల రాజు నవ్వి, "నీవు కోరిన వరం నిజంగా అవివేకమైనదే. వరం పుచ్చుకుని వెళ్ళి పోయాక నీవు పడుతూ ఉండిన పాట్లన్నీ ఊహించుకుని మేమంతా ఎంతో ఆనందించాం. అందుచేత నిన్ను క్షమిస్తాను. నీవు మామూలు మనిషివి కావాలంటే, ఈ కొండ మీదగా వెళితే మరొక లోయ కనిపిస్తుంది. దాని ఎగువను కొంతదూరంలో ఒక నది పుట్టింది. అక్కడ నీవు స్నానం చెయ్యి," అన్నాడు.

మైడాస్ అక్కడికి వెళ్ళి నీటిలో మునిగి లేవగానే ఆయన ధరించిన బంగారుదుస్తులు మామూలు దుస్తులై తడిసిపోయాయి. మైడాస్ మామూలు మనిషి అయాడు. అయితే ఆయన మునిగినచోట నదీ ప్రాంతమంతా బంగారం మయం అయింది.

మైడాస్ మునిగిన నదిపేరు పక్టోలస్. అది పుట్టినచోట ఇప్పటికీ బంగారం దొరుకుతుందట.






"రాముణ్ణి అడవులకు నెట్టి భరతుడికి రాజ్యాభిషేకం జరిగే ఉపాయం నేను చెబుతాను విను. విని నేను చెప్పినట్టు నడుచుకో. ఒకప్పుడు దేవాసుర యుద్ధంలో ఇంద్రుడికి నీ భర్త సహాయం వెళ్ళాడు. ఆయన వెంట నీవూ వెళ్ళావు. దండకారణ్యాలలో మత్స్యధ్వజు డేలే వైజయంతం వద్ద శంబరుడనే మహా బలశాలి అయిన అసురుడితో నీ భర్త గొప్పగా యుద్ధంచేసి గాయపడి మూర్ఛిల్లాడు. అప్పు డాయనను నీవు యుద్ధరంగం నుంచి దూరంగా తీసుకుపోయి ఆయన ప్రాణాలు కాపాడావు. స్పృహ తెలిసినాక ఆయన నీ సేవకు సంతోషించి నీకు రెండు వరాలిచ్చాడు. కాని వాటిని నీవు తరవాత కోరుకుంటానన్నావు. చూశావా? ఇప్పుడా రెండు వరాలూ కోరుకునే సమయం వచ్చింది. రాముణ్ణి పధ్నాలుగేళ్ళు అడవులకు పంపమనీ, భరతుడికి పట్టాభిషేకం చెయ్యమనీ నీ విప్పుడు నీ భర్తను కోరు!" అని మంధర కైకేయికి హితవు చెప్పింది.

కైకేయి, పాపం, సహజంగా మంచి స్వభావం కలదేగాని, మంధర చేసిన బోధలతో ఆమె మనస్సు పెడదారి పడింది. ఆ మంధర తన తలలో ఒక చెడ్డ భావం ప్రవేశపెట్టడంతో బాటు ఆ ఆలోచన సానుకూలమయే ఉపాయం కూడా చెప్పింది.

కైకేయి మంధరను, "ఓసి గూనిదానా! నిజంగా నీ వెంత తెలివిగల దానవే! నా మేలు నీవు కోరినట్టుగా మరెవరూ కోరరు



గదా!" అని ప్రశంసించింది. ఆమె గూని దాని సలహాతో తన నగలన్నీ తీసివేసి, చిరిగిన కోక ఒకటి చుట్టుకుని, కోపగృహానికి వెళ్ళి, కటిక నేల మీద అలిగిన దానిలాగా పడుకున్నది.

"నీ భర్త నిన్ను చూడవచ్చినప్పుడు కంటికీ మంటికీ ఏకధారగా ఏడు. నీ కోపం గాని, నీ శోకంగాని రాజు కొంచెమైనా భరించలేడు. వాటిని పోగొట్టటానికి ఆయన తన ప్రాణాలనైనా ఇస్తాడు. నేను చెప్పిన రెండు వరాలూ ఇచ్చినదాకా నీవు మెత్తబడకు! నీకు మణులూ, ముత్యాలూ, బంగారమూ ఇస్తానంటాడు; అక్కర్లేదని బెట్టు చెయ్యి.



ఆలోచించుకో, భరతుడు పద్నాలుగేళ్ళు రాజ్యపాలన చేసినాక అతన్ని ఎవరూ కదిలించ లేరు," అన్నది మంథర.

"ఆ శంబరాసురుడి కన్న నీ కెక్కువ తంత్రాలు తెలుసు గదే!" అని కైకేయి మంథరను మెచ్చుకున్నది. తన భర్త తనకు వరాలివ్వని పక్షంలో చచ్చి పోవటానికి కూడా ఆమె నిచ్చయించుకున్నది.

దశరథుడు రామ పట్టాభిషేక యత్నాలకాజ్ఞ ఇచ్చి, ఈ శుభవార్త కైకేయికి తానే స్వయంగా తెలిపే ఉద్దేశంతో కైకేయి శయన గృహానికి వచ్చి, అక్కడ ఆమె లేకపోవటం చూసి ఆశ్చర్యపడి, "కైకేయీ, ఎక్కడున్నావు?" అని పిలిచాడు. జవాబు లేదు. ఆయన అంతఃపుర ద్వారం దగ్గిరికి వచ్చి అక్కడి ద్వారపాలికను, "కైకేయి ఎక్కడ?" అని అడిగాడు.

ద్వారపాలిక భయంతో చేతులు జోడించి, "ప్రభూ, వారు కోపగృహంలో ఉన్నారు," అని చెప్పింది.

దశరథుడు కలవరపడుతూ కోపగృహానికి వెళ్ళి, అక్కడ నేలపైన పడి ఉన్న కైకేయిని చూశాడు. లక్ష వరహాల విలవచేసే ముత్యాలహారాలూ, ఇతర ఆభరణాలూ నేలపై చెల్లా చెదరుగా పడి ఉండి,





ఆకాశంలో నక్షత్రాల లాగా మెరుస్తున్నాయి. దశరథుడు కైకేయిని సమీపించి ఎంతో ప్రేమతో ఆమెను బుజ్జగిస్తూ, "దేవీ, నీ కెందుకిలా కోపం వచ్చింది? ఎవరిమీద? ఎవరన్నా నిన్ను తిట్టారా? అవమానించారా? ఒంట్లో సరిగా లేదా? వైద్యులను పిలిపించనా? ఎందు కేడుస్తావు? ఊరుకో! కావాలంటే నీ యిష్టం వచ్చిన వాళ్ళను దండిస్తాను! నిర్దోషులైనా సరే! నీ కోసం ఏ దరిద్రుణ్ణి అయినా ధనికుణ్ణి చేస్తాను. నీకు నాతోబాటు మిగిలిన వారంతా విధేయులై ఉండగా ఈ దుఃఖం దేనికి? నీ కోరిక ఏమిటో చెప్పు; నాప్రాణాలు ఒడ్డి అయినా సరే ఆ కోరిక తీరుస్తాను! లే, కైకేయీ, లే!" అన్నాడు.

ఈ మాటలు విని కైకేయి, "నా కెవరూ అపకారం చెయ్యలేదు, అవమానమూ చెయ్యలేదు. నా కొక కోరిక ఉన్నది. దానిని మీరు తీరుస్తారని ప్రమాణం చేసేటట్టయితే చెబుతాను," అన్నది.

దశరథు డీ మాటలకు చిరునవ్వు నవ్వి, కైకేయి జుట్టు చేతితో నిమురుతూ, తన ప్రాణంతో సమానమైన రాముడి పైన ఒట్టు పెట్టుకుని, ఆమె కోరిక తీర్చటానికి ప్రమాణం చేశాడు.



అప్పుడు కైకేయి దశరథుడికి శంబరాసురుడితో జరిగిన యుద్ధాన్నీ, మూర్ఛితుడై ఉన్న సమయంలో తాను ఆయనను రక్షించి దూరంగా తీసుకుపోయి పరిచర్యలు చేసిన విషయాన్నీ, ఆ సమయంలో ఆయన రెండు వరాలిస్తాను కోరమంటే తాను తరవాత కోరుకుంటానన్న సంగతీ జ్ఞాపకం చేసింది. తరవాత ఆ వరాలు రెండూ బయట పెట్టింది; రాముడికి జరగ బోతున్న పట్టాభిషేకాన్ని భరతుడికి చెయ్యాలి, రాముడు నారబట్టలనూ, కృష్ణాజినాన్నీ, జడలనూ, మునివేషాన్నీ ధరించి పధ్నాలు గేళ్ళు దండకారణ్యంలో నివసించాలి!



ఈ మాటలు వింటుంటే దశరథుడి కేదో భయం పుట్టుకొచ్చింది, స్పృహతప్పి నట్టయింది. కాళ్ళూ, చేతులూ వణికాయి. బాధతో నిట్టూర్పులు విడుస్తూ, ఆయన కైకేయిని నానాతిట్లూ తిట్టాడు.

"నీవు రాజకుమార్తె వనుకుని తెచ్చి ఇంట్లో పెట్టుకున్నాను. కాని నీవు విషం కక్కే పామువు. నిన్ను తల్లిగా చూసుకుంటాడు గదా, ఆ రాముడికి ఇంత ద్రోహం ఎలా తలపెట్టావు? నేను నీకేం ద్రోహం చేశాను? ఏ మహాపాతకం చేశాడని రాముణ్ణి అడవికి పంపను? నా ప్రాణాలనైనా వదల గలను గాని రాముణ్ణి చూడకుండా బతక లేనే! ఈ దిక్కుమాలిన ఆలోచన మానుకో! నీ కాళ్ళు నెత్తిన పెట్టుకుంటాను, నన్ను కరుణించి ఈ వరం అడగకు. భరతుడంటే నాకు ప్రేమ లేదేమోనని పరీక్ష చెయ్యటానికి ఇలా అని ఉంటావు. రాముడు చేసిన సేవలో ఎన్నోవంతు కూడా భరతుడు నీకు చెయ్యలేదు. నీకు రాముడి కంటె భరతుడెక్కువ అంటే నేను నమ్మను. నీ మాటలతో నన్ను చాలా బాధపెట్టావు. చూడూ, నేను ముసలివాణ్ణి. కాటికి కాళ్ళు చాచుకొని ఉన్నాను. కావలిస్తే భూమండల మంతా తీసుకో కాని రాముడిపై ఆగ్రహించకు. నీకు చేతులు జోడించి నమస్కారం చేస్తాను," అని కైకేయిని దశరథుడు ఎంతోసేపు వేడుకున్నాడు.

దశరథుడు ఇలా దిగజారిపోతున్న కొద్దీ కైకేయికి ఆగ్రహం రెచ్చింది. మొదట వరాలిస్తాననీ, ఇప్పుడు కోరిక తీరుస్తాననీ ప్రమాణాలు చేసి దశరథుడు బేలగా మాట్లాడటం రాజకులానికే కళంకమని ఆమె అన్నది. తన వరాలను ఉపసంహరించుకొననీ, రాముడి పట్టాభిషేకం జరిగే పక్షంలో తాను చచ్చిపోతాననీ అన్నది.

దశరథుడు మానసిక వేదనతో దహించుకు పోయాడు. ఎటువంటి విషమపరిస్థితి!



"నాయనా, అడవికి పోరా!" అని రాముడితో ఎలా చెప్పటం? కైకేయి కోరిక ప్రకారం రామపట్టాభిషేకం మానేస్తే ఇతర రాజులంతా, "పట్టాభిషేకం చాలా బాగా చేశారే?" అని యద్దేవా చెయ్యరూ? కౌసల్యా ముఖం ఎలా చూడటం? ఆయన తనలో తాను దుఃఖించాడు, కైకేయిని తిట్టాడు, బతిమాలాడు, మధ్య మధ్య మూర్ఛ పోయాడు. ఆ రాత్రి ఆయనకు కాలరాత్రి లాగా గడిచి తెల్లవారింది.



వసిష్ఠుడు తన శిష్యులతోసహా రాచనగరుకు వచ్చి, దశరథుడి అంతఃపురం వాకిలి దగ్గిర సుమంత్రు డెదురుకాగా, తాను వచ్చిన సంగతి రాజుగారికి చెప్పమన్నాడు. పట్టాభిషేకం ఏర్పాట్లన్నీ పూర్తి అయాయనీ, రాజుగారు కదిలిరావటమే వ్యవధి అనీ వసిష్ఠుడు చెప్పగా సుమంత్రుడు స్వేచ్ఛగా అంతఃపురం ప్రవేశించాడు. సుమంత్రుడు వృద్ధుడు కావటంచేతా, రాజుగారికి ఆ బాల్య మిత్రుడు గనకా ఆయనను ఎవరూ అడ్డను. ఆయన తిన్నగా రాజుగారున్న చోటికి వెళ్ళి, రాజుగారి మనస్థితి ఊహించక, ఆయన నిద్రపోతున్నాడనుకుని, "మహారాజా, లేవండి. సూర్యోదయం కూడా అయింది. రామపట్టాభిషేకం జరిపించటానికి అందరూ తమ రాక కోసం చాలాసేపుగా ఎదురు చూస్తున్నారు," అని చెప్పాడు.

దశరథుడు శోకంతో వాచి ఎర్రగా ఉన్న కళ్ళతో సుమంత్రుణ్ణి చూసి, "ఏమోయ్, నన్ను నీ మాటలతో ఇంకా ఎందుకు దుఃఖ పెడతావు?" అన్నాడు. దశరథుడు దుఃఖంలో ఉన్నాడని తెలియగానే సుమంత్రుడు చేతులు జోడించి, రెండడుగులు వెనక్కు వేశాడు. దశరథుడు సుమంత్రుడితో మాట్లాడేస్థితిలో లేనందున కైకేయి, "సుమంత్రుడా, తెల్లవార్లూ మహారాజుకు రామపట్టాభిషేక మన్న ఆనందంతో నిద్ర లేదు. ఇప్పుడే కాస్త కునుకు పట్టింది. నీవు





"తామంతా వచ్చిన సంగతి నేను మహారాజు గారికి తెలియ జేస్తాను. వారి దగ్గిరికి రాముణ్ణి తీసుకు పోతున్నాను," అని చెప్పాడు.

అయన మళ్ళీ వెనక్కు తిరిగి దశరథుడి అంతఃపురానికి వెళ్ళి, దశరథుడు పడుకుని ఉన్న చోటికిచేరి, "దశరథ మహారాజా, విజయీభవ. రాత్రిగడిచి, తెల్లవారి, సూర్యోదయంకూడా అయింది. మీ కోసం బ్రాహ్మణులూ, సేనాపతులూ, పట్టణంలోని పెద్దలూ ఎదురుచూస్తున్నారు. నిద్రమేలుకుని జరగవలసిన కర్మకాండ జరిపించండి," అన్నాడు.

"రాముణ్ణి తీసుకు రమ్మని కైకేయి నీతో చెప్పెనే? తీసుకురాకుండా ఎందుకు వచ్చావు? ఆమె ఆజ్ఞ నా ఆజ్ఞకాదా? నేను నిద్రపోవటం లేదు. మేలుకునే ఉన్నాను. వేగిరం రాముణ్ణి తీసుకురా!" అన్నాడు దశరథుడు.

సుమంత్రుడు చిత్తమని చెప్పి, రాజుకు నమస్కారంచేసి, "ఏదో గొప్ప ఏర్పాటే జరగబోతున్నది!" అని తనలో తాను సంతోషపడుతూ, రాజ వీధి వెంట జనం ఉత్సాహంగా పట్టాభిషేకం గురించి అనుకునే మాటలువింటూ రాముడుండే నగరుకు రథం తోలుకుని వచ్చాడు. అక్కడ జనం

వెళ్ళి రాముణ్ణి పిలుచుకురా. ఇదే రాజుగారి ఆజ్ఞ అనుకో," అన్నది.

"రాముడు ఇక్కడికి వచ్చి పట్టాభిషేకం చేసుకుంటాడు కాబోలు!" అనుకుంటూ సుమంత్రుడు అక్కడి నుంచి కదిలాడు. నగరమంతా ఉత్సవంలాగా కోలాహలంగా ఉన్నది. రాజసభ జనంతో కిక్కిరిసి ఉన్నది. సంబారాలన్నీ సిద్ధంగా ఉన్నాయి. రాజులందరూ కానుకలు తెచ్చారు. వారు తమలోతాము, "రాజుగారు కనిపించరు. మనం వచ్చిన సంగతి వారికెలా తెలియడం?" అనుకుంటున్నారు. సుమంత్రుడు మర్యాదగా వారిని పలకరించి,

గుంపులు గుంపులుగా చేరి ఉన్నారు. రాముడి అంతఃపురంచుట్టూ ఏనుగులూ, గుర్రాలూ, సైనికులూ, మంత్రులూ కిటకిట లాడుతున్నారు. సుమంత్రుడు వారి నందరినీ తోసుకుంటూ వెళ్ళి, రాముడుండే ఏడంత స్తులమేడ ప్రవేశించాడు. తాను వచ్చినట్టు రాముడికి కబురుపంపి, అతని అనుమతితో రాముడుండే చోటికి వెళ్ళాడు.

రాముడు చక్కగా అలంకరించుకుని బంగారు చక్కీపై కూచుని ఉన్నాడు. సీత పక్కనే నిలబడి వింజామర వీస్తున్నది. సుమంత్రుడు అతన్ని సమీపించి, నమస్కరించి, "తండ్రిగారు కైకేయి అంతఃపురంలో ఉన్నారు. నిన్ను చూడాలంటున్నారు," అని చెప్పాడు. ఈ మాటలువిని రాముడు ఆనందంతో పొంగి పోయాడు. అతను సీతను లోపలికి పంపి, పట్టాభిషేకానికి చేసిన అలంకారా లన్నిటితోనూ సుమంత్రుడి వెంట బయలుదేరాడు. అతను పులితోలు పరిచిన రథం ఎక్కి కూచోగానే, లక్ష్మణుడుకూడా వెనకగా ఎక్కి, ఒక చేత్తో అన్నగారికి ఛత్రం పట్టి, రెండవ చేత్తో చామరం వీచాడు.

రాముడి వెనకగా గుర్రాలూ, ఏనుగులూ ఎక్కిన రౌతులూ, కోలాహలంగా వేలకొద్దీ జనమూ నడిచారు.

రాముడి రథం దశరథుడి నగరు ప్రవేశించి, మూడు ప్రాకారాలు దాటి నిలిచి పోయింది. తన వెంట వచ్చిన బలగమూ, ప్రజలూ అక్కడ నిలిచిపోగా, రాముడు కాలినడకను మరి రెండు ప్రాకారాలు దాటి దశరథుడి అంతఃపురం ప్రవేశించాడు.

ఒక అందమైన ఆసనంపైన దశరథుడూ, కైకేయీ కూచుని ఉన్నారు. రాముడు తండ్రి కాళ్ళకూ, తరవాత కైకేయి కాళ్ళకూ నమస్కరించాడు. "రామా," అంటూ ఏదో చెప్పబోయి, దశరథుడు గొంతు పెగలక, కళ్ళు మూతపడి, కన్నీరు కారుస్తూ దుఃఖంతో వివశుడయాడు.



# 1. ఎవరెస్టు శిఖరం

నేపాలు-చైనా సరిహద్దుపై నున్న హిమాలయ శిఖరం. ప్రపంచంలోకెల్లా ఎత్తయినది. ఎత్తు 29,002 అడుగులు. 1922 లగాయతు ఈ శిఖరాన్ని చేరటానికి చాలా యత్నాలు జరిగాయి. చివరకు 1953 మే 29 న టెన్సింగ్, హిల్లరీలు ఈ శిఖరాన్ని అందుకున్నారు.





# ప్రశ్నోత్తరాలు

1. జె. మోహనరావు, యలవర్రు

ఖలీఫా ఉమర్ ఏ సంవత్సరమున చనిపోయెను? అతను ప్రాత గుడ్డలు ధరించుటకు కారణమేమి?

ఖలీఫా ఉమర్ క్రీ. శ. 644 లో ఒక బానిసవాడి చేత హత్య చేయబడ్డాడు. అతనిలో ఇస్లాము మతాభిమానం తప్ప భోగలాలస ఏమీలేదు. అది తరువాత వచ్చిన ఖలీఫాలలో ఏర్పడింది.

2. మద్దాల సీతామహాలక్ష్మి, వేటపాలెం

"నా తండ్రి నీ కిచ్చిన మృతసంజీవని మంత్రము [నీకు] ఫలించకుండుగాక," అని దేవయాని శాపమిచ్చినది గదా, కచుడు స్వర్గానికి వెళ్ళి ఆ మంత్రమును దేవతలకు చెప్పినాడని, దేవతలుకూడా తమలో చచ్చినవారిని బ్రతికించుకొన్నారని వ్రాసినారు. మరి దేవయాని శాపము ఏమైనదో తెలియులేదు, అన్నయ్యగారు!

ఆ మంత్రం తనకు పారదు గనకనే కచుడు దాన్ని ఇతర దేవతలకు చెప్పవలిసి వచ్చింది. మృతసంజీవని ఎవరికీ పనిచెయ్యకుండా దేవయాని శాపం ఇవ్వలేదుగద!

3. కె. రాధాకిషన్‌రావు, హన్మకొండ

"చందమామ"కు ఎట్లాంటి కథలను పంపిస్తే ప్రచురిస్తారో సెలవిస్తారా?

"చందమామ"లో ఎలాటి కథలు చదివి మీరు అనందిస్తున్నారో అలాటివే పంపితే ప్రచురిస్తాము.

4. వ. ప్రజ్ఞాపారమిత, అనంతపురం

ఫొటో వ్యాఖ్యల పోటీకి ప్రచురించే ఫొటోలు మీ ఫొటోగ్రాఫర్లు తీసినవా? లేక ఎవరేనా మంచి ఫొటోలు తీసి పంపవచ్చునా?

మాకు స్టాఫ్ ఫొటోగ్రాఫర్లు లేరు. ప్రసిద్ధులైన ఫొటోగ్రాఫర్లు తీసిన ఫొటోలనే ఉపయోగిస్తున్నాం. మంచి ఫొటోలు ఎవరైనా పంపవచ్చు.

5. హెచ్. అర్. స్వర్ణలత, బైరెడ్డిపల్లి

నదులు, చెరువులు పొంగి దేశాన్ని నాశనం చేస్తాయి కానీ ఎడతెరిపి లేకుండా ఎన్నో నదులు సముద్రములో కలుస్తూ ఉంటే సముద్రం దాని హద్దు మీరలేదే?

బావి నుంచి తోడిన నీరు బావిలో తిరిగి పోస్తే పొర్లిపోతుందా? ఎన్ని నదులు వచ్చి సముద్రంలో పడినా వాటన్నిటి నీరూ సముద్రం నుంచి ఆవిరి అయి, మేఘాలుగా ఏర్పడి అక్కడక్కడికీ వెళ్ళిపోయి, వర్షం రూపంలో తిరిగి భూమిమీద పడినదేకద!

6. మొహిద్దీన్ పాషా, కైకలూరు

రాముడు విశ్వామిత్రుడితో కలసి జనకుడి దగ్గరకు వెళ్ళినప్పుడు రాముడి వేషం ఒక ఋషిలాగా వుండవలిసింది—

అవసరం లేదు. రాముడు సీతాలక్ష్మణులతో అడవికి వెళ్ళినప్పుడు మాత్రమే తాపస వేషం ధరించాడు, విశ్వామిత్రుడి వెంట వెళ్ళేటప్పుడు కాదు.

7. డి. కె. వెంకటరెడ్డి, బొలారం

"ఋగ్వేదం లోహయుగంలోనే పుట్టింది..." అని వ్రాశారు. ఈ అభిప్రాయం పాశ్చాత్య చారిత్రక గ్రంథముల ననుసరించి ఉన్నది. వేదమనాదిసిద్ధమనీ అపౌరుషేయమనీ మీ రెరుగక పోవటం శోచనీయం.

"భారత చరిత్ర" అన్నమాటను కూడా మీరు పాటించక పోవటం కూడా శోచనీయమేగద!

8. పి. నందకుమార్, సి. కోటిలింగం, అర్. వెంకటేశ్వర్లు, కేసముద్రం

మామా, దాసూ వాసూలు బట్టలు మార్చుకోరా?

మార్చుకుంటారు. కాని మళ్ళీ అలాటివే వేసుకుంటారు.

9 రాయసం సీతాదేవి, భీమవరం

అన్నయ్యా, "గుండు భీమన్న" కథలు ఎప్పటివరకు వేస్తావు?

ఇంకా చాలా వున్నాయి.

10. కూర్మాల నరసింహారావు, పర్చూరు

"ఆంధ్ర సచిత్ర వార పత్రిక"లోని చిత్రకారుడు శంకర్, మీ పత్రికలోని చిత్రకారుడు శంకర్ ఒకరేనా?

కాదు. ఇద్దరూ వేరువేరు.

Photo by Pranlal K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

యుద్ధానికి పిలుపే వస్తే...

పంపినవారు :
ఎస్. రాజ్యలక్ష్మి - హైద్రాబాద్

Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

వృద్ధాప్యం అడ్డొస్తుందా?

పంపినవారు:
ఎస్. రాజ్యలక్ష్మి - హైద్రాబాద్

# అట్టచివరి బొమ్మ

గదాయుద్ధంలో దుర్యోధనుణ్ణి పడగొట్టినందుకు పాండవపక్ష యోధులు భీముణ్ణి అభినందిస్తూ ఉంటే, కృష్ణుడు వారిని ఊరుకోమనే నెపం మీద దుర్యోధనుణ్ణి ఎత్తి పొడుస్తూ, "పెద్దవాళ్ళందరూ చెప్పిన మాటలు పెడచెవిని బెట్టి ఈ పురుషాధముడు ఈ స్థితికి వచ్చాడు. చచ్చిన వాణ్ణి ఇంకేం చంపుతారు. రథాలెక్కండి. మన దారిన మనం పోదాం," అన్నాడు.

తొడలు తెగి పడి ఉన్న దుర్యోధనుడు ఈ మాటలు విని కోపంతో, చేతుల మీద కొంచెంగా లేచి, "కృష్ణా, నీ కంటె పాపి ఎవడు? భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, కర్ణుణ్ణీ, నన్నూ అధర్మ యుద్ధంలోనే గదా ఓడించావు? నా తొడలు కొట్టమని నీవు చెప్పించటం నేను గమనించ లేదనుకున్నావా? నీకు సిగ్గయినా లేదేం?" అన్నాడు.

"నీవు చిన్నతనం నుంచీ పాండవులకు చేయిస్తూ వచ్చిన అన్యాయాలకు, నేను చేయించినవి ప్రతిక్రియలు. నీవు లోభివై పాండవులకు రాజ్యం ఇవ్వకపోబట్టే గదా అసలీ యుద్ధం జరిగింది!" అన్నాడు కృష్ణుడు.

తరవాత పాండవులు దుర్యోధనుడి శిబిరానికి వెళ్ళారు. అది బావురుమంటున్నది. కృష్ణుడు అర్జునుడితో, "గాండీవం తాడు తీసెయ్యి. అక్షయ తూణీరాలు తీసుకుని ముందు నీవు రథం దిగు, తరవాత నేను దిగుతాను," అన్నాడు.

అర్జునుడు రథం దిగాక కృష్ణుడుకూడా దిగిపోగానే రథం భగ్గున మండి క్షణంలో బూడిద అయిపోయింది. అర్జునుడు ఆశ్చర్యంతో, "ఇదేమిటి?" అన్నాడు.

"అస్త్రాలు దీన్ని ఏనాడో దగ్ధం చేశాయి. నేను ఉన్నందువల్ల ఇది ఇంతవాకా తగలబడకుండా నిలిచి ఉంది," అన్నాడు కృష్ణుడు.

పాండవులు దుర్యోధనుడి శిబిరంలో ఉన్న సమస్త సంపదనూ, దాస దాసీ జనాన్నీ అధీనం చేసుకున్నారు. గాంధారీ ధృతరాష్ట్రులను ఊరడించటానికి బయలుదేరుతూ కృష్ణుడు పాండవులతో, "మీరీ రాత్రి శిబిరంలో పడు కోవటం శుభకరం కాదు," అని చెప్పాడు. వారు ఓఘవతీ నదీతీరానికి వెళ్ళారు.

దుర్యోధనుడు తొడలు విరిగిపడి ఉన్నాడని తెలియగానే అశ్వత్థామ కృప కృత వర్మలు అతని వద్దకు వెళ్ళి ఏడిచారు. అశ్వత్థామ, "రాజా, ఈ రాత్రే ఆ పాండవులనూ, పాంచాలురనూ చంపేస్తాను, అనుమతి ఇయ్యి!" అన్నాడు.

దుర్యోధనుడు కృపాచార్యుడితో, "గురువర్యా, ఒక చెంబుతో నీరు తెచ్చి ఈ అశ్వత్థామను కౌరవ సేనాపతిగా అభిషేకించు!" అన్నాడు. అభిషేకం పొంది అశ్వత్థామ అప్యాయంగా దుర్యోధనుణ్ణి ఆలింగనం చేసుకున్నాడు. తరవాత హతశేషులైన ముగ్గురు వీరులూ దుర్యోధనుణ్ణి విడిచి వెళ్ళిపోయారు.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1962 ఫిబ్రవరి సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ డిసెంబరు నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫొటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## డిసెంబరు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : యుద్ధానికి పిలుపే వస్తే...

రెండవ ఫోటో : వృద్ధాప్యం అడ్డొస్తుందా?

పంపినవారు : S. రాజ్యలక్ష్మి, c/o S. సూర్యనారాయణమూర్తి, బి. ఏ.,

H. No. 1–8–509, చిక్కడప్పల్లి, హైదరాబాదు. (ఆంధ్రప్రదేశ్)

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒక రోజున దాసూ, వాసూలు కొండ దగ్గిరకు షికారు వెళ్ళారు. అక్కడ వాళ్ళకు గొర్రెలు కాచే కుర్రవాడు కనిపించి, "అదుగో, ఆ గుహలో ఒక వింత భూతం వున్నది. కావాలంటే మంత్రం వేసి దాన్ని గుప్పెట్లో పట్టుకుని బయటికి తెస్తాను. మీ చేత అయితే, మీరు తెండి," అన్నాడు. దాసూ, వాసూలు వాణ్ణే తెమ్మన్నారు. గొర్రెలు కాచే కుర్రవాడు కర్ర ఊపుతూ, కేకలు వేస్తూ గుహలోకి వెళ్ళబోయేసరికి, లోపలి నుంచి పెద్ద ధ్వని వచ్చింది. గొర్రెల కుర్రాడు తారుకుని పారిపోసాగాడు. గుహలో నుంచి, 'టైగర్' బయిటికి దూకి వాడి వెంట పడింది. "ఇదే, వింత భూతం!" అంటూ దాసూ, వాసూలు నవ్వుకున్నారు.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'















'నాలుగు 'వానవెల్లి'
రంగులలో
వచ్చింది-నాలక్స్
... తెలుపులో
కూడా!'

అని ఎమ్.ఎన్.రాజమ్
చెప్పుచున్నది

LTS 82-X29 TL

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి



''గుండమ్మ కథ''లో

అబ్బాయిల తండ్రి

